# ఆంధ్రనామ సంగ్రహము



పైడిపాటి లక్ష్మణకవి ప్రణీతము



ఓం శ్రీరామాయ నమః

శ్రీ పైడిపాటి లక్ష్మణకవి విరచిత

# ఆంధ్రనామ సంగ్రహము

సటీకము

---

క. శ్రీపతివంద్యు విశాలా
క్షీపతిని భజించి యిష్ట సిద్ధులు వరుసన్
బ్రాపింపఁగ గణనాథుని
శ్రీ పాదంబులకు నెఱఁగి చెందిన వేడ్కన్. 1

కవి శంకరభక్తుఁడు. కవులు తాము రచించునది సంపత్కరముగ నుండ నాశింతురు. కాఁబట్టి వారు శ్రీకారముతోఁ దమ కావ్యముల నారంభించుట పరిపాటి. అందుచే లక్ష్మణకవియు, లక్ష్మీనామముతోనే, కృతి నారంభించుచున్నాఁడు. కాని యితని ప్రయోగము సొగసుగ నున్నది. లక్ష్మికధిపతియైనవానికి వంద్యుఁడైనవాఁడు. కాఁబట్టి తనకుఁగాని తన కృతికిఁగాని సన్మంగళముల నీయుటలో సందియ మేమి యుండును? ఒక్క సంపదయేగాదు కవి విశాలాక్షీపతియని సంబోధించిన యన్నపూర్ణ భుక్తిదాయిని, అట్టి కాంతకుఁ బతిని భజించుచున్నాఁడు. ఈ రెండు పదములతో మంగళములును భుక్తియు లభించునని భజించి = సేవించి, ఇష్టసిద్ధులు = (అణిమాద్యష్ట) సిద్ధులు (ఇఁక నివియేగదా వాంఛనీయములు) వరుసన్ = క్రమముగ, వ్యాపింపఁగన్ = పొందించుటకు, గణనాథుని = ప్రమథగణముల కధిపతియై విఘ్ననివారకుఁడైన గణపతియొక్క, శ్రీపాదంబులకున్ = మంగళకరములైన పాదములకు, ఎఱఁగి = నమస్కరించి, చెందిన = వారి యనుగ్రహమునఁ గలిగిన, వేడ్కన్ = ఉత్సాహముతో (క్రింది పద్యముతో నన్వయము).

క. నతభక్తలోకరక్షా
రతికిన్ జంచత్కృపాత రంగితమతికిన్

శతమఖముఖసురనుతిసం
గతికిన్ మహిమోన్నతికిని × గాశీపతికిన్. 2

నతభక్తలోక = నమస్కరించిన భక్తుల సమూహమును, రక్షారతికిన్ = రక్షించు నపేక్షగలవానికి, చంచత్ = ప్రకాశించు, కృపాతరంగిత = దయయను నలలుగలదిగాఁ జేయఁబడిన, మతికిన్ = మనస్సుగలవానికి, శతమఖముఖ = నూఱు యాగములు సలిపిన యింద్రుఁడు మొదలగు, సురనుతి = దేవతల స్తోత్రముచే, సంగతికిన్ = కూడినవానికి, మహిమోన్నతికిన్ = మహిమచే గొప్పవాఁడైనవానికి, కాశీపతికిన్ = కాశీవిశ్వనాథునకు (క్రింది పద్యముతో నన్వయము).

తే. అంకితమొనర్తుఁ దెనుఁగుపే × ళ్ళరసి కూర్చి
గరిమతో నాంధ్రనామ సం × గ్రహమనంగ
నమరుకృతిఁ బైఁడిపాటి × యేకామ్రమంత్రి
సుతుఁడఁ గవి లక్ష్మణాఖ్యుఁడ × సుజన హితుఁడ. 3

పైడిపాటి ఏకామ్రమంత్రిసుతుఁడన్ = పైడిపాటి ఏకామ్రమంత్రి కుమారుఁడనై, కవి లక్ష్మణాఖ్యుఁడన్ = లక్ష్మణకవియని పేరుగలవాఁడను, సుజనహితుఁడన్ = సజ్జనులకుఁ గావలసినవాఁడనైన నేను, తెనుఁగుపేళ్లు = తెనుఁగునందలి పేళ్లను, అరసికూర్చి = సంగ్రహించి యొకచోఁ జేర్చి, ఆంధ్రనామసంగ్రహమనంగన్ = ఆంధ్రనామసంగ్రహమను పేరుతో, అమరుకృతిన్ = ఒప్పునటువంటి గ్రంథమును, అంకితమొనర్తున్ = సమర్పించుకొనుచున్నాను. భగవదర్పిత మొనరించి కవి ధన్యుఁడయ్యెను.

ఈ కవి తండ్రి యేకామ్రమంత్రి యనియుఁ దా నీశ్వర భక్తుఁడనియు, సుజనులకు మిత్రుఁడనియుఁ దెలిపి తృప్తినందుచున్నాఁడు. తనను గూర్చి మఱేమియుఁ జెప్పికొనకపోవుట స్వయం ప్రకర్ష లేమిని జూపుచున్నది.

తే. దేవ మానవ స్థావర × తిర్యగాఖ్య
వర్గులొనరింతు నానార్థ × వర్గుఁగూడ



వర్గములు గాఁగఁ గూర్తు నా × హ్వాయములందు
నిడుదు వివరించునెడల సం × స్కృతపదంబు 4

ఈ రచనమునందు, లక్ష్మణకవి సాధ్యమైనంతవఱకు నమరకోశము ననుసరించి, దేవాది వర్గములలో వ్రాసియున్నాఁడు. అందుఁదా నేదేవి వ్రాసినదియు నిం దుదహరించుచున్నాఁడు. దేవ మానవ, స్థావర, తిర్యక్ + ఆఖ్యన్ = దేవతలు, మానవులు, స్థావరములు. (నదులు కొండలు) తిర్యక్కులు (పశుపక్ష్యాదులు) అను పేళ్లుగల, వర్గులు = పదసముదాయములను, ఒనరింతున్ = వ్రాయుదును. నానార్థ వర్గున్ = ఒకే పదమునకుఁ బెక్కర్థములు గల పద సముదాయమును, కూడన్ = చేరగా, వర్గములు కాఁగన్ = అయిదు విభాగములు కలుగునట్లుగా, కూర్తున్ = రచింతును, ఆహ్వాయములందు = విషయ వివరణమునందు, సంస్కృత పదంబు = సాంస్కృతిక పదమును, ఇడుదున్ = ఉంతును.

క. శ్రీలలనాధిపవంద్య వి
శాలాక్షీప్రాణనాథ × శతమఖముఖ ది
క్పాలాభీష్టద సమధిక
శీలా కాశీనివేశ × శ్రీవిశ్వేశా! 5

శ్రీలలనాధిపవంద్య = లక్ష్మీదేవికి నాయకుఁడైన విష్ణునిచే నమస్కరింపఁబడువాఁడా! విశాలాక్షీ ప్రాణనాథ = విశాలాక్షికి భర్తయైనవాఁడా? శతమఖముఖ = ఇంద్రుఁడు మొదలైన, దిక్పాలాభీష్టద = దిక్పాలుర కోర్కులఁ దీర్చువాఁడా! సమధికశీలా = మిక్కిలి గొప్పయైన ప్రవర్తనఁ గలవాఁడా! కాశీ నివేశ = కాశి నివాసముగాఁ గలవాఁడా, శ్రీవిశ్వేశా = సంపత్కరుఁడవైన విశ్వనాథా! నా గ్రంథమును చిత్తగింపవలయును అని కవి తన యిష్టదైవమును బ్రార్థించుచున్నాఁడు.

దేవతలకు సంబంధించిన పదసముదాయము

సీ. ముక్కంటి యరపది మోముల వేలుపు
మినుసిగదయ్యంబు మిత్తిగొంగ
గట్టువిల్తుఁడు గఱ కంఠుఁడు మిక్కిలి
కంటిదేవర బేసి కంటివేల్పు
వలిమలల్లుఁడు మిన్ను వాకతాలుపు కొండ
వీటిజంగము గుజ్జు వేల్పుతండ్రి
వలరాజుసూడు జ క్కులజేని చెలికాఁడు
బూచులయేకిమీఁడు పునుకతాల్పు

తే. విసపు మేఁతరి జన్నంపు వేఁటకాఁడు
బుడుత నెలతాల్పు వెలియాల పోతురౌతు
తోలుదాలుపు ముమ్మొన వాలుదాల్పు
నాఁగ భవదాఖ్యలొప్పు (నం ధకవిపక్ష). 6

అంధకవిపక్ష = అంధకాసురునకు శత్రువైనవాఁడా! ముక్కంటి= మూడు + కన్నులుగలవాఁడు (త్రిలోచనుఁడు), అరపదిమోముల వేలుపు= అయిదుముఖముల దేవుఁడు (పంచాననుఁడు), మినుసిగ దయ్యంబు = ఆకాశము జుట్టుగాఁగల దైవము (వ్యోమకేశుఁడు), మిత్తిగొంగ = మృత్యువునకు శత్రువు(మృత్యుంజయుఁడు), గట్టువిల్తుఁడు = మేరువుధనువుగాఁగలవాఁడు (మేరుధన్వి) కఱకంఠుడు[1] = నల్లని కంఠముగలవాఁడు (నీలకంఠుఁడు), మిక్కిలి కంటిదేవర = ఎక్కువగాఁ గన్నుగలదైవము, బేసికంటివేల్పు = మూడు కన్నులుగలవాఁడు (అసమనయనుఁడు). వలిమల[2] + అల్లుఁడు =

1. మహాకవి ప్రయోగమగుట నిది గ్రామ్య మయ్యెను.
2. అత్తునకు సంధి వైకల్పికము.



హిమాలయమున కల్లుఁడు. మిన్నువాకతాలుపు = ఆకాశమందలి నదిని ధరించినవాఁడు (గంగాధరుఁడు), కొండవీటి జంగము = కొండనివాసము గాఁగల బిచ్చగాఁడు, గుజ్జువేల్పుతండ్రి = వినాయకుని తండ్రి, వలరాజు సూడు, మన్మథునిశత్రువు (మదనారి), జక్కులజేని చెలికాఁడు = యక్షుల రాజైన కుబేరుని మిత్రుఁడు (యక్షేశసఖుఁడు), బూచులయేకిమీఁడు = పిశాచములకు నాయకుఁడు (భూతేశుఁడు), పునుకతాల్పు = బ్రహ్మకుండిన యైదవతల త్రెంచి యా కపాలమును ధరించినవాఁడు (కపాలభృత్తు), విసపుమేఁతరి[1] = విసమును తినినవాఁడు, జన్నంపు[2] వేఁటకాఁడు = దక్షుని యజ్ఞమును ధ్వంసము చేసినవాఁడు (క్రతుధ్వంసి), బుడుత నెలతాల్పు = చిన్ని నెలను తాల్చినవాఁడు (బాలేందు శేఖరుఁడు), వెలియాలపోతు రౌతు = తెల్లనియెద్దు వాహనముగాఁ గలవాఁడు, తోలుదాల్పు = వ్యాఘ్ర (గజ) చర్మము ధరించినవాఁడు, ముమ్మొన (మూఁడు మొనలుగలది) వాలు తాల్పు = శూలమును ఆయుధముగాఁ బట్టువాఁడు (శూలి), నాఁగ = అనఁగా, అంధకవిపక్ష = చీఁకటిదొంగ! భవదాఖ్యలు + ఒప్పు = నీ పేరులగును.

సీ. సోఁకుమూఁకలగొంగ చుట్టుఁగైదువుజోదు
పచ్చవిల్తునితండ్రి లచ్చిమగఁడు
పులుఁగుతత్తడిరౌతు వలమురి తాలుపు
వెన్నుఁడు కఱివేల్పు వెన్నదొంగ
నునుగాడ్పుదిండి పా నుపునఁ బండెడు మేటి
బమ్మదేవరతండ్రి తమ్మికంటి
బదివేసములసామి పసిఁడి పుట్టముదాల్పు
కట్టినెచ్చెలి తరి గట్టుదారి

1. మేఁత + అరి. మతుబర్థకమునందు 'అరి' వర్ణకంబు జాలాదులకగు.
2. కర్మధారయమునందలి ముకర్ణకమునకు పుంపులగు, (విసపు మేఁతరి.)

**తే.** యాలకాపరి వ్రేతల నేలువాఁడు
పాలకడలల్లుఁడును బక్కి డాలుఁ జేఁడు
రేయుఁ బవలును జేయు కన్దోయివాఁడు
మామమామన హరియొప్పు (శ్రీమహేశ!) **7**

సోఁకుమూఁకలగొంగ = రాక్షసులకు శత్రువు (దైత్యారి), చుట్టుఁ[1] గైదువు జోదు = చక్రాయుధముగల వీరుఁడు (చక్రపాణి), పచ్చవిలుని తండ్రి = మన్మథునకుఁ దండ్రి, లచ్చిమగఁడు = శ్రీపతి, పులుఁగుతత్తడి రౌతు = గరుడుఁడు వాహనముగాఁ గలవాఁడు. (గరుడవాహనుఁడు), వలమురితాలుపు = పాంచజన్యము ధరించువాఁడు, వెన్నుఁడు = (విష్ణుశబ్దభవము) అంతట నిండియుండువాఁడు, కఱివేల్పు = నల్లని దైవము, వెన్నదొంగ = కృష్ణావతారమున వెన్న నపహరించెనుగనుక, (నవనీతచోరుఁడు) నునుగాడ్పు = మెల్లనిగాలిని, తిండి = తినుపాముగ, పానుపునఁ బండెడుమేటి = పఁటపుపైఁ బరుండువాఁడు. (వాతాశనశయనుండు) బమ్మదేవరతండ్రి = బ్రహ్మదేవుని జనకుఁడు, తమ్మికంటి[2] = పద్మనేత్రుఁడు (పుండరీకాక్షుఁడు), పదివేసములసామి = దశావతారములనెత్తిన దేవుఁడు (స్వామి ప్ర. సామి వికృతి), పసిఁడిపుట్టముదాల్పు = పచ్చనిబట్టఁ గట్టినవాఁడు (పీతాంబరుఁడు) కఱి నెచ్చెలి[3] = అర్జునునకు మిత్రుఁడు. తిరిగఁబుదారి = మందరము ధరించినవాఁడు (మందరము మొకప్పుడు దేవ రాక్షసులచే కవ్వముగాఁ జేయఁబడినది కాన తరిగ ట్టనఁబడెను, ధారిశబ్ద భవము దారి యని గ్రహింపవలెను.) ఆలకాపరి[4] =

1. ఉదంత స్త్రీసమంబులకుఁ బుంపులకు నుగాగమము.
2. కన్నులు గలవాఁడనుటకు బహువ్రీహిసాచ్ఛికమున కంటి యగుట గమనించునది. (ముక్కంటి).
3. కవ్వడి ప్ర_కబ్జీ_వి_సెజు + చెలి - ప్రాంతాదుల యాద్యక్షరశేషములకు పరుష సరళములు పరమగునపుడు మీఁది హల్లునకు ద్విత్వము.
4. ఆవు ప్రభృతులకు బహువచనము పరంబగునపుడు తుదివర్ణమునకు లోపము విభాష. ఆవులు_ఆలు.

కడలల్లుఁడు = కడలి + అల్లుఁడు. ఇత్తునకు సంధి బహుళము. (సాధుత్వము విచార్యము.)



గోపాలుఁడు, వ్రేతల నేలువాఁడు = గొల్లపడుచులను ఏలు ప్రియమైనవాఁడు (గోపికా వల్లభుఁడు), పాలకడలల్లుఁడు = క్షీరసముద్రమునకు లక్ష్మిని పెండ్లియగుట నల్లుఁడు, పక్కిడాలుజేఁడు = పక్షి జెండాపైఁ గలవాఁడు (గరుడధ్వజుఁడు), రేయి[1] బవలును జేయు[2] కన్దోయివాఁడు = రాత్రింబగళ్లు సేయు సూర్య చంద్రులు కన్నులుగాఁ గలవాఁడు; మామమామ = తన మామకు మామయైనవాఁడు (లక్ష్మినిచ్చిన సముద్రునకు, తన బిడ్డయగు (విష్ణుపది) గంగనిచ్చి మామయయ్యెను), అనఁగా = అనఁగా. హరి ఒప్పు... = విష్ణువు అగును. శ్రీ మహేశ = శివుని సంబోధనము. (అమరసింహునివలె నీ కవియుఁ గృష్ణనామములు పెక్కు విష్ణునకొసంగెననుట గమనింపఁదగు.)

సీ. పక్కిడాల్వేలుపు పొక్కిలి పసిబిడ్డఁ
డంచ తేజీనెక్కి యాడురౌతు
మనెడుప్రొద్దులనొసఁ గెల్లను వ్రాయు దేవర
చదువుల వేలుపు జన్నిగట్టు
తెలిదమ్మిఁగద్దియఁ గొలువుండు రాయుఁడు
నిక్కపు జగమేలు నేర్పుకాఁడు
కడుపుబంగారు బొక్కసముఁ జేసిన మేటి
పోఁగొగిరముతిండి పోఁతుతండ్రి

ఆ. నలువ తమ్మిచూలి నలుమొగంబుల వేల్పు
వేల్పుపెద్ద పలుకు వెలఁది మగఁడు
తాత బమ్మ యన విధాత నామములొప్పు
(నఘవినాశ యీశ యభ్ర కేశ). **8**

పక్కిడాల్వేలుపు = గరుడుఁడు ధ్వజముగాగల దేవుఁడు; పొక్కిలి = (పద్మమువంటి) బొడ్డునందలి. పసిబిడ్డ = చిన్నబిడ్డఁడు, అంచ తేజీనెక్కి

1. ద్వంద్వంబుమీఁది పరుషములకు సరళము.
2. ప్రాంతాదులకార్యము.

యాడురౌతు = హంసవాహనముపై విహరించువాఁడు, మనెడుప్రొద్దుల = ఆయుఃకాలమును, నొసళ్ళనువ్రాయు దేవర = ఫాలములందు లిఖించు దేవుఁడు, చదువుల వేలుపు = విద్యల కునికిపట్టగు దేవుఁడు, జన్నిగట్టు = జన్నిదము తాల్చినవాఁడు, తెలిదమ్మిగద్దియ[1] = తెల్లతామరయను సింహాసనముపై, కొలువుండు రాయఁడు = సభచేయు నాయకుఁడు, నిక్కపు జగమేలు సేర్పుగాఁడు = సత్యలోకము నేలు నిపుణుఁడు, కడుపు బంగారు బొక్కసముచేసిన మేటి = ఉదరములో బంగారమున కునికిపట్టు గావించినవాఁడు-(హిరణ్యగర్భుఁడు), పోరోగిరము తిండిపోతు తండ్రి = కలహాశనుఁడగు నారదునకు జనకుఁడు, నలువ = నాలుగు వర్ణములఁ జేసినవాఁడు, తమ్మిచూలి = పద్మమునుండి పుట్టినవాఁడు (పద్మగర్భుఁడు), నలు[2] మొగంబుల వేల్పు = నాలుగుముఖముల దేవుఁడు, వేల్పు పెద్ద = దేవతలలో మొదటివాఁడు (సురజ్యేష్ఠుఁడు), పలుకు వెలఁది మగఁడు = సరస్వతీపతి (వాక్పతి), తాత = తండ్రులకు తండ్రి (పితామహుఁడు), అనఁగ = అనఁగా, అఘవినాశ = పాపముల నశింపఁజేయువాఁడా!, ఈశ = లోకనాయకా! అభ్రకేశ = ఆకాశము జుట్టుగాఁగలవాఁడా, విధాత నామములు = బ్రహ్మపేళ్లె, ఒప్పుఁగ = తగియుండును.

తే. గట్లరాయనిపట్టి ము · క్కంటి వెలఁది
యేనుఁగులఁగొంగ తత్తడి · నెక్కుదంట
సామిసామేనిఁ జేకొన్న · చాన జగము
తల్లి యన గౌరి పేళ్ళొప్పు · (ధర నుమేశ). 9

ధరన్ = లోకమునందు, ఉమేశ = పార్వతీధవా! గట్లరాయని పట్టి = కొండల కధిపతియగు హిమవంతునిబిడ్డ (శైలేంద్రసుత), ముక్కంటివెలఁది = త్రిలోచనుని భార్య. ఏనుఁగులగొంగ = ఏనుఁగులకు విరోధియగు సింహమును, తత్తడి = గుఱ్ఱమును, ఎక్కుదంట = ఎక్కుడు నిపుణురాలు, సామి సా[3]మేనిఁ జేకొన్నచాన = నాథుని

1. పదాంత ఎత్వమున కీ యాగమము.
2. సమాసంబునందలి నాలుగునకు నలువర్ణకంబగు.
3, సగము మేనుసామేను. సాబాలిత్యాదులు ప్రయోగమునుబట్టి గ్రాహ్యములు.



సగము దేహముగొనిన స్త్రీ. జగముతల్లి = లోకజనని (ఈ పేరు లక్ష్మికిఁ జెల్లును. "లోకమాతా," మా, యని యమరము), అనఁగ = అనఁగా, గౌరిపేళ్లు = గౌరీదేవి పేళ్లు ఒప్పును.

తే. లచ్చి కలుములజవరాలు · పచ్చవిల్తు
తల్లి కడివేల్పు ఇల్లాలు · తల్లితల్లి
కడలి కూఁతురు సిరి లిబ్బి · పడఁతి తమ్మి
యింటిగరితన (శ్రీ) యొప్పు · (మృగధరాంక). 10

లచ్చి = లక్ష్మీశబ్దభవము, కలుముల జవరా[1]లు = సంపదలిచ్చు స్త్రీ, పచ్చవిల్తుతల్లి = మదనునితల్లి, కడివేల్పుని[2]ల్లాలు = నీలాంగుఁడగు విష్ణుని భార్య, తల్లితల్లి = (మామమామ యన్నటు లిదియుఁ బ్రత్యేకార్థము గలది. లోకమునకుఁ దల్లి గంగ ఆమెపుట్టిన విష్ణునికి భార్య), కడలికూఁతురు = క్షీరోదధి తనయ, సిరి = శ్రీశబ్దభవము, లిబ్బిపడఁతి = ధనరూపిణియైన స్త్రీ; తమ్మియింటిగరిత = పద్మమునందుండు కాంత (పద్మాలయ) (ఇట గరిత + అన = గరితన అసాధువు) అనఁగ = అనఁగా, శ్రీ ఒప్పుఁగ = లక్ష్మియగును.

క. తలవాఁకిటను మెలంగెడు
పొలఁతుక పలుకుల వెలంది · పొత్తముముత్తో
నలువపడఁతి కలుములపైఁ
దలికోడలనంగఁ బరఁగు · (ధర) వాణి (శివా). 11

ధరన్ = లోకమున, శివా! = ఓ శివుఁడా!, వాణి = సరస్వతీదేవి, తలవాఁకిటను మెలంగెడు పొలఁ[3]తుక = తలకు వాకిలి వంటిదగు నోరు నివాసముగాఁగల స్త్రీ, పలుకుల వెలంది = మాటలిచ్చు దేవత - (వాణి)

1. పేదాదుల కాలు శబ్దము పరంబగునపుడు రుగాగమము.
2. షష్ఠీ తత్పురుషమందలి ఉకారఋకారముల కచ్చు పరమగునపుడు నుగాగమము.
3. నెలఁతాదులకు నుకవర్ణకంబగు.

పొత్తము ముత్తో = పుస్తకముగల ముత్తైదువ, నలువపడఁతి = బ్రహ్మకు నిల్లాలు, కలుముల పెద్దలికోడలు = లక్ష్మికిఁ గోడలు, అనంగ = అనఁగా, పరఁగు = ఒప్పును.

సీ. ఇద్దఱు తల్లుల ✿ ముద్దుబిడ్డఁడు పని
చెఱుపులదొర చేట ✿ చెవుల వేల్పు
వంకర తొండంబు ✿ వాఁ డేనుఁగు మొగంబు
దేవర పాఁప జం ✿ దెముల మేటి
మ్రొక్కువారలపనుల్ ✿ చక్కఁ జేసెడు సామి
గఱికపూజల ✿ మెచ్చు గబ్బి వేల్పు
ముక్కంటిపండుల ✿ మెక్కెడితిండీఁడు
ముక్కంటిగారాబు ✿ ముద్దుపట్టి
తే. పెద్ద కడుపు వేల్పు ✿ పిళ్ళారి కుడుముల
తిండికాఁడు కొక్కు ✿ తేజి రౌతు
గుజ్జువేలు పొంటి ✿ కొమ్ము దేవర వెన
కయ్య యన వినాయ ✿ కాఖ్య (లీశ). 12

ఇద్దఱు తల్లులముద్దుబిడ్డఁడు = గంగాపార్వతులకుఁ బ్రియమైనకుమారుఁడు (ద్వైమాతురుఁడు), పని చెఱుపులదొర = పనులఁ బాడుచేయు రాజు (విఘ్నేశుఁడు), చేటచెవులవేల్పు = ఏనుఁగుచెవులుగల దేవుఁడు (గజకర్ణుఁడు), వంకరతొండంబువాఁడు = వంపుదిరిగిన తుండముగలవాఁడు (వక్రతుండుఁడు). ఏనుఁగు మొగంబు దేవర = ఏనుఁగు ముఖముగల దేవుఁడు (గజవదనుఁడు), పాఁ[1]పజందెముల మేటి = పాములు జన్నిదముగా గల వాఁడు, మ్రొక్కువారల పనుల్ చక్కఁ జేసెడుసామి = నమస్కరించు వారి కార్యముల నిర్వర్తించువాఁడు, గఱిక పూజల మెచ్చు గబ్బివేల్పు = కేవలము గఱికతో పూజించినను తృప్తుఁడగు దేవుఁడు, ముక్కంటి

1. నామ్వాదుల కనుమ్వాదులకు పఙ్ యగు. (పాముజందెము-పాఁపజందెము).



పండుల = టెంకాయలు, మెక్కెడితిండీఁడు, ఎక్కువగాఁ దినువాఁడు (కుడుములు దినుట జగద్విఖ్యాతముకాని టెంకాయలు దినుట విచార్యము. ఏనుఁగు ముఖముగలిగి యుండుట వెలఁగకాయలుదినుట సంభవము). ముక్కంటిగారాబు ముద్దుపట్టి = ఈశ్వరునకు మిక్కిలి గూర్చెడు కుమారుఁడు. పెద్దకడుపు వేల్పు = పెద్ద పొట్టగల దేవుఁడు = (లంబోదరుఁడు) పిళ్లారి (ఇది యరవలెక్కు డుపయోగించు నామము), కుడుముల తిండికాఁడు[1] = కుడుముల తినువాఁడు, కొక్కు తేజిరౌతు = కొక్కె వాహనముగాఁ గలవాఁడు. గుజ్జువేలుపు = పొట్టిదేవుఁడు, ఒంటికొమ్ము దేవర = ఒకదంతముగలవాఁడు - (ఏకదంతుఁడు), వెనకయ్య (వినాయకశబ్ద భవమేమో) అనగ = అనఁగా, ఈశ! = ఓ శంకరా! వినాయక + ఆఖ్యలు = వినాయకుని పేళ్లు.

సీ. వెనుఁబాఁపకవణంబుఁ ✿ దినువారువము రౌతు
గట్టులయెకిమీని ✿ పట్టిపట్టి
తెల్లుచూ లార్గురు ✿ తల్లుల కొమరుండు
గాడుపుసంగడి ✿ కానికొడుకు
పుంజు దాలుపు వేలు ✿ పులజేనిదళవాయి
జంటముమ్మోములఁ ✿ దంట వేల్పు
కొంచగుబ్బలివ్రక్క ✿ లించిన బలు దిట్ట
రెండాఱుచేతుల ✿ దండిమగఁడు
తే. వేలుపులమూఁక పేరిటి ✿ వెలఁది మగఁడు
వేల్పుగమికాఁడు వెనకయ్య ✿ వెనుకవాఁడు
కొమరుసామి మన సేనాని ✿ కొమరుమిగులు
(విగత భవపాశ కాశీని ✿ వేశ యీశ!) 13

విగతభవపాశ = వదలింపఁబడు పుట్టుకయను త్రాళ్లుగలవాఁడా! (పుట్టుక లేనట్లు సల్పువాఁడు), కాశినివేశ = కాశి నివాసముగాఁగల

1. ఆటాదులకు పుంస్త్వస్త్రీత్వంబుల కాఁడు, కత్తెలగు.

వాఁడ ! ఈశ = ఈశ్వరా! పెనుఁబాఁపకవణంబుకా = పెద్దసర్పమును కబళ మును, తినువారువము రౌతు = తినునట్టి నెమిలి వాహనముగాఁ గలవాఁడు, గట్టులయెకిమీని పట్టిపట్టి = కొండల నాయకుండగు హిమవంతుని బిడ్డ యగు పార్వతికుమారుఁడు. తెల్లచూలు = తెల్లగడ్డిలోఁ బుట్టినవాఁడు_(శరజన్ముఁడు), ఆరురుతల్లులకొమరుఁడు = ఆరురు కృత్తికలకుఁ బుట్టిన వాఁడు_(అగ్నిభవుఁడు), పుంజుదాలుపు = కోడిని జెండాపైఁగలవాఁడు వేలుపులజేని దళవాయి = ఇంద్రుని సేనానాయకుఁడు, జంటముమ్మో ముల దంటవేల్పు = రెండుమూళ్ల వదనములుగల దేవుఁడు_(షడాననుండు), కొంచగుబ్బలి వ్రక్కలించినదిట్ట = క్రౌంచపర్వతమును పరశురాముని తోడిపందెములోఁ తొఱ్ఱచేసినవాఁడు (క్రౌంచవిదారణుఁడు), రెండాఱు చేతుల దండిమగఁడు = పంద్రెండు చేతులుగల మహావీరుఁడు, వేలుపుల మూఁక పేరిటి = దేవతలసేన పేరుగల దేవసేనయను, వెలఁదిమగఁడు = స్త్రీకి పతి, వేల్పుగమికాఁడు = దేవతల సేనపఁబతి, వెనకయ్య వెనకవాఁడు = వినాయకుని తర్వాత పుట్టినవాఁడు, కొమారసామి = కుమారస్వామిశబ్ద భవము. అనకా = అనఁగా, సేనాని = షణ్ముఖుఁడు, కొమరుమిగులుకా = ఒప్పును.

సీ. అలరువిల్తుండు క ꠰ న్నులవిల్తుఁడును గమ్మ
విలుకాఁడు చక్కెఱ ꠰ వింటివాఁడు
చెఱకువిల్కాఁడు కెం ꠰ జిగురుల విల్తుఁడు
వేడవిల్తుఁడును బచ్చ ꠰ విల్తుఁ డించు
విల్లుదాలుపు తుంట ꠰ విలుకాఁడు తియ్యవి
ల్కాఁడును జమిలిము ꠰ క్కాలినారి
విలుకాఁడు చౌవంచ ꠰ ములుకులుగలదంట
రాచిల్కనెక్కిడి ꠰ రాయరౌతు

తే. మీను మొసలిసిడంబుల ꠰ మేటి చంద
మామయల్లుఁడు వలరాజు ꠰ మరుఁడు లచ్చి



కొమరుఁ డనుపేళ్ళ నొప్పును ꠰ గుసుమధన్వి
(విగతభవపాశ కాశీ ని ꠰ వేశ యీశ). **14**

అలరువిల్తుఁడు = పూవులే విల్లుగాఁగలవాఁడు (పుష్పధన్వుఁడు), కన్నుల విల్తుఁడు = గణపులుఁగల (చెఱకు) ధనుస్సుగాఁ గలవాఁడు! కమ్మ విలుకాఁడు = చక్కెరవింటివాఁడు = తీయనైన చెఱకు ధనువుగాఁగల వాఁడు (ఇక్షుధన్వుఁడు); కెంజిగురుల[1] విల్తుఁడు = ఎఱ్ఱనైన చిగురుటాకులు ధనువుగాఁ గలవాఁడు; వెడవిల్తుఁడు = తేలికైన ధనువు గలవాఁడు; ఇంచు[2] విల్లుఁదాలుపు = చెఱకును విల్లుగా ధరించువాఁడు; తుంట విలు కాఁడు = చెఱకుతుంటను విల్లుగాఁగలవాఁడు; తియ్యవిల్కాఁడు = తియ్యని విల్లుగలవాఁడు; జమిలిముక్కాలినారి విల్లుకాఁడు = మూడు జంటల కాళ్లుగల తుమ్మెద లల్లెత్రాడుగాఁగల విల్లుగలవాఁడు; చౌవంచ ములుకులుఁగలదంట = అయిదు బాణములుగల జోదు (పంచబాణుఁడు); రాచిల్కనెక్కిడు రాయరౌతు = రాచిలుకను వాహనముగాఁగల రాజా శ్వికుఁడు; మీను మొసలి సిడెంబులమేటి = చేఁప మొసలి టెక్కెముున గురుతులుగాఁగల ప్రోఁడ; చందమామ యల్లుఁడు = చంద్రుని యల్లుఁడు; వలరాజు = వలపునకు నధిపతి; మరుఁడు = మన్మథుఁడు; లచ్చికొమ రుఁడు = లక్ష్మీదేవి కుమారుఁడు; అనుపేర్ల = అనుపేళ్ళతోఁ; కుసుమ ధన్వి = పూవిలుకాఁడు. ఒప్పును.

సీ. చలువలతేఁడు వె ꠰ న్నెలతేఁడు రేతేఁడు
జాబిల్లి రేవెల్గు ꠰ చందమామ
తమ్ములపగవాఁడు ꠰ కమ్మవిల్తునిమామ
కలువలతేఁడు పా ꠰ ల్కడలిపట్టి

1. కెంపు + చిగురు - కెంజిగురు - ప్రాతాదుల లుప్తశేషములకు పరుషసరళములు పరంబులగునపుడు నుగాగమంబు, నుగాగమమున కిట బిందువు.

2. ఇక్షు (ప్ర) - ఇంచు (వికృ)

జక్కవకవవిప్పా ƒ ముక్కంటి తలపువ్వు
చుక్కలదొర ప్రొద్దు ƒ జోడుకోడె
తపసికన్పాప బి ƒ త్తరిజింక తాలుపు
కటివేల్పుడాకన్ను ƒ కడలివెన్న
తే. పంటపైరులయేకిమీఁదు ƒ జంటదంట
చౌకములపాళ్ళ తెలిముద్ద ƒ చలివెలుంగు
వేలుపులబువ్వ చీఁకటి ƒ వేరువిత్తు
నెలయనఁగఁ జంద్రు పేళ్లొప్పు ƒ (నీలకంఠ). 15

నీలకంఠ = నీలమైన మెడగల శంకరా! చలువలఱేఁడు = చల్లదనముల కధిపతి; వెన్నెలఱేఁడు = వెన్నెలల కధిపతి; రేఱేఁడు = రాత్రికిఁ బతి; జాబిల్లి = (జాను + బిల్లిక) = అందమైన బింబము; రేవెల్గు[1] (రేయి + వెలుఁగు) = రాత్రి వెలుతురు నిచ్చువాఁడు; చందమామ = చంద్రమాశబ్దభవము; తమ్ములపగవాఁడు = తామరల శత్రువు (జలజారి)! కమ్మవిల్తునిమామ = మన్మథుని తల్లి తోఁబుట్టినవాఁడు; కలువలఱేఁడు = కలువల వికసింపఁజేయువాఁడు; పాల్కడలిపట్టి = పాలసముద్రమున నుదయించినవాఁడు; జక్కవకవ విప్పు = చక్రవాక దంపతుల విడఁదీయువాఁడు; (చక్రవాకములు పగలు, చకోరములు రాత్రి విహరించును), ముక్కంటి తలపువ్వు = శివుని తలపైన పూవువంటివాఁడు (చంద్రశేఖరుఁడు); చుక్కలదొర = ఉడుపతి; ప్రొద్దుజోడుకోడె = (ప్రథమభవము) ప్రొద్దు సూర్యునితో (వెలుతురిచ్చుటలో) సముఁడు; తపసి కన్పాప = తపస్వి కంటిపాప (అత్రినయనములనుండి పుట్టినవాఁడని భావము); బిత్తరిజింక తాలుపు = అందమైన ఇఱ్ఱిని ధరించినవాఁడు; కటివేల్పుడాకన్ను = నల్లని దేవుఁడగు విష్ణుని ఎడమకన్ను; కడలి వెన్న = పాలసముద్రమునకు వెన్నవంటివాఁడు; పంటపైరుల యేకిమీఁదు = పైరులకు రాజు (ఓషధీనాథుఁడు); జంట దంట చౌకములపాళ్ల తెలిముద్ద = రెండు రెండుల (నాలుగు) నాలుగు నాలుగుల (పదునాఱు) భాగములుగల తెల్లనిముద్ద (చంద్రుఁడు

1. ప్రాతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకు లోపము.



పదునాఱుకళలుగలవాఁడు); చలివెలుంగు = శీతకరుఁడు (చల్లని వెలుఁగునిచ్చువాఁడు; వేలుపుల బువ్వ = దేవతలయాహారమైనవాఁడు (చంద్రుని కళలు నగుసైదును దేవతల కాహారము); చీకటి వేరువిత్తు = చీకటిని పోగొట్టువాఁడు; నెల = మాసమున కొకసారి మార్పునందువాఁడు; అనఁగా, చంద్రుని పేళ్లగును.

సీ. వెన్నునివలకన్ను ƒ వేఁడి వేలుపు ప్రొద్దు
తొవలరాయిడికాఁడు ƒ పవలు సేయు
వేలుపు పచ్చగు ƒ ఱ్ఱాలవజీరుండు
వేఁడివెలుంగు రే ƒ వెల్గుబోడు
జంటాఱుమేనుల ƒ సామి చీఁకటిగొంగ
యెఱ్ఱని వేలుపు ƒ నివముసూడు
చదలుమానికము ప్రాఁ ƒ జదువుల పెట్టియ
యేడుగుఱ్ఱముల తే ƒ రెక్కుబోదు
ము వ్వేలుపులయిక్క ƒ మొక్కుల దేవత
గాములఱేఁడు జ ƒ క్కవలఱేఁడు
వేయి చేతులఱేఁడు ƒ వెలుఁగులయేకిమీఁదు
చెయువులసాకిరి ƒ చాయమగఁడు
తే. మింటి తెరువరి తమ్మి వా ƒ ల్గంటిమగఁడు
పోరసీగైడు మొనగాండ్రు ƒ పోవుదారి
జగముచుట్టంబు జమునయ్య ƒ జలముకన్ను
నాఁగ సూర్యుని పేళ్లొప్పు ƒ (నాగభూష). 16

నాగభూష = పాములు భూషణముగాఁగలవాఁడా! వెన్నునివలకన్ను = విష్ణుశబ్దభవము వెన్నుఁడు, అతని కుడికన్ను; వేఁడి వేలుపు = వేఁడితనముగలదేవుఁడు; ప్రొద్దు = కాలమును దెలుపువాఁడు; తొవలరాయిడికాఁడు = కలువలసంకటపెట్టువాఁడు; పవలు సేయు వేలుపు = పగటికాథా

రము (దినపతి); పచ్చగుఱ్ఱాల వజీరుఁడు = పచ్చనిగుఱ్ఱములు రథవాహములు గాఁగలవాఁడు; వేఁడి వెలుఁగు = వేఁడితనముగల వెలుతురుగలవాఁడు; రేవెల్లుజోడు = చంద్రునికి సైఁదోడు! జంటారుమేనులసామి = పండ్రెండు రూపములుగలవాఁడు-(స్వామిభవము-సామి); చీకటిగొంగ = చీకటికిశత్రువు; ఎఱ్ఱనివేలుపు = (అరుణోదయమున) ఎఱ్ఱగనగపడు దేవుఁడు; ఇవమునూడు = మంచునకు శత్రువు; చదలుమానికము = ఆకాశమునకు మణివంటివాఁడు - (మాణిక్యభవము - మానికము) నభోమణి; ప్రాంజదువుల పెట్టియ = వేదములకు మూలమైనవాఁడు - (సూర్యునుండి వేదములు వ్యాపించెనని కొందఱు); ఏడుగుఱ్ఱముల తేరెక్కుజోదు = ఏడు గుఱ్ఱములుగల రథము నెక్కువీరుఁడు - సప్తాశ్వుఁడు; ముప్వేలుపుల యిక్క = బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు నిదానమైనవాఁడు; మ్రొక్కులదేవర = (ఉదయించినంత నెల్లరచే) నమస్కరింపబడువాఁడు; గాముల తేఁడు = గ్రహములకుఁబలి; జక్కవల తేఁడు = చక్రవాకముల సంతసింపఁజేయువాఁడు; వేయిచేతుల తేఁడు = వేయికిరణములుగలవాఁడు; వెలుఁగులయెకిమీఁడు = కాంతులకధికతి; చెరువునిసాకిరి - కర్మలకుసాక్షి; చేప్పభవము - చెయుపు (భిక్షుబికిరమైనట్టి సాక్షిసాకిరియైనదేమో); ఛాయమగఁడు = ఛాయాదేవి భర్త (సంజ్ఞవంటి స్త్రీని నిర్మించి ఛాయయని పేరిడియుంచిపోయినదఁట); మింతెరువరి = ఆకాశమార్గమున చరించువాఁడు; (ఇది చంద్రునకు నగుయించును); తమ్మివాల్గంటిమగఁడు = పద్మినీకాంతుఁడు; పోరనీల్గెమొనగాండ్రు పోవుదారి = వీరమరణమందిన వారు సూర్యమండలముభేదించుకొనిపోవుదురు గాన నట్టివారికి మార్గమైనవాఁడు; జగచ్చుట్టము = (ప్రకాశమునిచ్చుటచే) లోకమునకు బంధువు; జమునయ్య = (జముని + అయ్య) యమునికిఁ దండ్రి; జగముకన్ను = వెలుతురిచ్చి విషయములు చూపుటచే లోకమునకుఁ గంటివంటి = వాఁడు - (జగచ్చక్షువు) నాఁగఁ = అనఁగా; సూర్యుని పేళ్లు ఒప్పుచున్నవి, (చంద్రునిఁజెప్పి సూర్యుని జెప్పుట విశేషము). Sun

సీ. చట్టుపల్ దెగగట్లఁ గొ గొట్టెడుజెట్టి నూ
అంచులవాలు చే గ మించుజోదు



దుగబొట్లపితేఁది యై గ దుకనుంగవల వేల్పు
పొలుతపసియింటి గ పంచకోడి
యొడలిచూపొడయఁ డ్కెక్కుడు మొగుల్ గల్రపోడ
నిక్కువీనులజక్కి గ నెక్కురౌతు
తెల్లయేనుఁగు నెక్కి గ తిరిగెడుదొర తూర్పు
మాగాని యేలెడు గ మణియకాఁడు

తే. జమిలిచౌవంచపదులు జగ న్నములు సేసి
నట్టివేలుపు సోమాసి గ పెట్టుఁజెట్టు
పొట్టితమ్ముఁడు గల్గిన గ యట్టివేల్పు
నాఁగ నింద్రుని పేళ్లొప్పు గ (నాగభూష). 17

చట్టుపల్ దెగగట్టఁగొట్టెడు జెట్టి = తెక్కలు తెగిపోవునట్లు కొండలఁగొట్టిన వీరుఁడు - (ఒకానొకపుడు పర్వతములు పక్షములుగలిగి లోకబాధనొనరించుచుండ వజ్రముచే పక్షచ్ఛేదన మొనరించెనఁట); నూటంచుల వాలు చేమించుజోదు = నూఱు మొనలుగల వజ్రాయుధమును చేతగలవీరుఁడు; దుగబొట్లపితేఁది యైదుకనుంగవల వేల్పు = రెండు సున్నలుగల యైదు (500) జంటలకన్నులు (1000) గలవాఁడు; పొలుతపసియింటి పంచకోడి = గౌతమునియింటియందు కోడియైనవాఁడు (గౌతముని భార్యయగుఅహల్యను గామించి యా తపసి తెల్లవారకముందే నదికేగునట్లు చేయఁ గోడియై - యింద్రుఁడు కూసెనఁట. ఆ ముని దాని నిజముగాభావించినదికిఁ బెడల నితఁడాతనిరూపుతో నామెను రమించెనఁట); ఒడలిచూపొడయఁడు = దేహమంతయుఁ జూపుగలవాఁడు (పైకార్యమునకుఁ గనలి యాముని శపింప దేహమంతయు బొక్కలుపడెనఁట, ప్రార్థనచే సదయుఁడై యా ఋషి యవి కన్నులుగా నితరుల కగుపడునని యనుగ్రహించెను); ఎక్కుడు మొగుల్ గల్రపోడ = ఎక్కఁదగిన (వాహనమలైన) మేఘములుగలమేటి; నిక్కువీనులజక్కి నెక్కురౌతు = పైకిలేచిన చెవులుగల (ఉచ్చైశ్శ్రవసు) గుఱ్ఱముపై స్వారీచేయువాఁడు; తెల్లయేనుఁగు నెక్కి తిరిగెడుదొర = ఐరావతము వాహన

మైనవాఁడు; తూర్పుమాగాని యేలెడి మణియకాఁడు = తూర్పుపాలము (తూర్పుదిక్కు) పాలించు మణియగాఁడు (అధికారి); జమిలిచావంచ పదులు = రెండు ఆయిదుల పదులు (100); జన్నములు = యజ్ఞములు; చేసినట్టివేలుపు = చేసినదేవుఁడు (నూ అశ్వమేధములు చేసిన నింద్రత్వము వచ్చునని ప్రమాణము; సోమానిపెట్టుఁ జెట్టు = సోమయాజులపాలికిఁ గల్పకమువంటివాఁడు; పొట్టితమ్ముఁడు గల్గిన యట్టివేల్పు = వామనుఁ దమ్మునిగాఁగల దేవుఁడు (బలిచక్రవర్తిచేఁ బీడింపఁబడిన దేవతలరక్షింప నదితికోర నామెకుఁ గశ్యపుఁడు వామనునిఁ బ్రసాదించెను); నాఁగఁ = అనఁగా, ఇంద్రుని పేళ్లగును.

ఆ. నీరుపాపగాలి ౸ నెచ్చెలి యన్నింటి
తిండికాఁడు కప్పు ౸ దెరువుజాడ
యంటరానివేల్పు ౸ జంటమోములసామి
యగ్గియనఁగనొప్పు ౸ ననలుఁ (డీశ). **18**

నీరుపాప = నీటివలనఁ బుట్టినవాఁడు; గాలినెచ్చెలి = గాలికి మిత్రుఁడు; అన్నింటి తిండికాఁడు = అన్నింటిని దినువాఁడు (సర్వభక్షకుఁడు); కప్పుఁదెరువుఁజాడ = నల్లనైనమార్గము పోకడగలవాఁడు; అంటరానివేలుపు = (మండుచుండుటచే) తాఁకటకు వీలుకానిదేవుఁడు; జంటమోములసామి = రెండుముఖములుగల దేవుఁడు! అగ్గి = అగ్ని; అనఁగఁ = అనఁగా; అనలుఁడు = అగ్నిదేవుఁడు, ఒప్పును - తూర్పున కధిపతినిఁ జెప్పి యాగ్నేయమున కధిపతి నిందుఁ జెప్పనైనది.

తే. జమునపైఁదోడు పెతరుల ౸ సామి జముఁడు
ప్రొద్దుకొమరుఁడు గుదెతాల్పు ౸ పోతుజక్కి
నెక్కి యాడెడుబలురౌతు ౸ దక్కిణంపు
సామియన నంతకుం డొప్పు ౸ (శ్రీమహేశ). **19**

జమునపైఁదోడు = (యమునాభవము జమున, యట్లే యముఁడు, జముఁడు.) యమునానదికి నన్న; సూర్యుని ప్రథమకళత్రమువలన యముఁడు, మనువు యమున పుట్టినట్లు పురాణములు చెప్పును.) పెతరుల సామి = పితృదేవతల కధిపతి (పితరులుభవము- పెతరులు, అట్లే ప్రియము- పెరియము); జముఁడు = యముఁడు; ప్రొద్దుకొమరుఁడు = సూర్యునికి సంజ్ఞాదేవివలనఁ బుట్టినవాఁడు; గుదెతాల్పు = గుదియను పట్టుకొను వాఁడు (దండధరుఁడు); పోతుజక్కి నెక్కి యాడెడు రౌతు = దున్నను వాహనముగాఁ గలిగి తిరుగువాఁడు; దక్కిణంపుసామి = దక్షిణమున కధిపతి; అనఁ = అన్నచో; అంతకుండు = యముఁడు; ఒప్పుఁ = ఒప్పారును. **Lord of South.**

ఆ. మూలఱేఁడు సోఁకు ౸ మూఁకలఱేఁడు రే
ద్రిమ్మరీఁడు పొలసు ౸ దిండిపోఁతు
రక్కసుండు నల్ల ౸ ద్రావువాఁడనఁగను
నిర్రుతిపేళ్లు సెల్లు ౸ (నీలకంఠ). **20**

మూలఱేఁడు = దక్షిణము పడమరల మూలయందుండువాఁడు; సోఁకు మూఁకలఱేఁడు = రక్కసుల సేనల నాయకుఁడు; రేద్రిమ్మరీఁడు = రాత్రించరుఁడు; పొలసు దిండిపోఁతు = మాంసమును తినువాఁడు, రక్కసుఁడు (రాక్షస శబ్దభవము); నల్లద్రావువాఁడు = రక్తమును త్రాగు వాఁడు; అనఁగను = అనినచో; నిర్రుతి పేళ్లు; సెల్లుఁ = అగును.

ఆ. మేటినీరుచూలి ౸ మెయితాలుపులసామి
వల్లెత్రాడుదాల్పు ౸ నీళ్ళరాయఁ
డేటిబోఁటిమగల ౸ యెకిమీఁడు పడమటి
దొర యనంగ నొప్పు ౸ వరుణుఁ (డీశ). **21**

మేటి[1] నీరుచూలి మెయితాలుపులసామి = గొప్పనైన నీటియందుఁ బుట్టిన దేహధారుల (జంతువుల) పతి; వల్లెత్రాడు[2] తాల్పు = త్రాడు నాయుధముగాఁ గలవాఁడు (పాశి); నీళ్ళరాయఁడు = నీటికధిపతి (జలధీశుఁడు) ఏటిబోఁటి మగల ఎకిమీఁడు = ఏళ్ళను స్త్రీలభర్తలగు సముద్ర

1. 2. నీరుచూలి, త్రాడుతాల్పు అను ప్రయోగములు ఔప విభక్తికి విధిగ్రహింపమిని ప్రయోగింపఁబడినవి. (టి ఆగమము.)

ములకు రాజు; పడమటి దొర = పడమటి దిక్కునకధిపతి; అనంగన్ = అనఁగా, వరుణుఁడు; ఒప్పు = ఒప్పును.

సీ. వడిగలజింక త ౹ త్తడి నెక్కునెఱరాతు
మేటిపాముల మేఁత ౹ నీటితాత
యొడలితాల్పులపిండు ౹ కుసు రగుబలియుండు
సోఁకుదయ్యము మింటి ౹ చూలి గాలి
కరువలి తెమ్మెర ౹ గాడ్పుపయ్యెర యొంటి
మ్రాకుల పెనుముప్పు ౹ మబ్బువిప్పు
సురటివీపులఁబుట్టు ౹ సుడిగొట్టు చలినట్టు
బక్కవారల పెను ౹ బాధ యీఁద

తే. అబ్బరపుఁ దియ్యవిలుకాని ౹ నిబ్బరంపు
దెబ్బపోరుల నలయిక ౹ ప్రబ్బుబోంట్ల
గబ్బిగుబ్బల చెమటల ౹ యుబ్బడంచు
గబ్బినాఁజను మారుతా ౹ ఖ్యలు (మహేశ). **22**

వడిగల జింక తత్తడి నెక్కునెఱ రాతు = వేగముగల జింక యను గుఱ్ఱము, ఎక్కు మేటి = సవారికాడు; మేటి పాముల మేఁత = గొప్ప పాముల కాహారమైనవాఁడు (పాములు గాలిఁదిని బ్రతుకునని ప్రసిద్ధి); నీటితాత = నీటికిఁ దండ్రికిఁ దండ్రి (వాయువునుండి తేజము, తేజము నుండి నీరు పుట్టెనని ప్రమాణము); ఒడలితాలుపుల పిండుకున్ = దేహ ధారుల సముదాయమునకు (జీవకోటికి); ఉసురగుబలియుండు = ప్రాణము లైన బలశాలి (జగత్ప్రాణుఁడు); సోఁకు దయ్యము = స్పర్శన జ్ఞాన మునకు నధిపతి (స్పర్శనమువలనఁ దెలియఁదగినవాఁడు); మింటిచూలి = (మిన్నుచూలి) ఆకాశమునుండి పుట్టినవాఁడు; గాలి, కరువలి, తెమ్మెర గాడ్పు = చల్లనిగాలి; పయ్యెర = దక్షిణము వైపునుండి వచ్చుగాలి; ఒంటి మ్రాకుల పెనుముప్పు = ఒంటిగానుండు చెట్లఁ బడఁగొట్టుటచే నాపదైనవాఁడు; మబ్బువిప్పు = మేఘముల విరియఁ జేయువాఁడు;



సురటి వీపులఁ బుట్టు = వీవనల వీచుటచేఁ బుట్టువాఁడు; సుడిగొట్టు = సుడిగాలిగా నుండువాఁడు; చలినట్టు = చలి పుట్టించువాఁడు; బక్కవారల పెనుబాధ = బక్క చిక్కినవారి కెక్కువ బాధగానుండువాఁడు; ఈఁద = ఈఁదరగాలి; అబ్బురపు = ఆశ్చర్యకరుఁడైన; తియ్యవిలుకాని = మన్మథునియొక్క; నిబ్బరపు = దృఢమైన; దెబ్బ పోరులన్ = రతి క్రీడలందు; అలయికన్ = అలసటను; ప్రబ్బు = పొందిన; బోంట్ల = స్త్రీలయొక్క; గబ్బిగుబ్బలన్ = బిగువైన పాలిండ్లయందలి; చెమటల యుబ్బు = చెమట నీటి గొప్పను; అడంచు = అణచివేయు, గబ్బి = ప్రోడ (రతి క్రీడాజనిత స్వేదము నార్చువాఁడు); నాన్ = అనఁగా; మారుతాఖ్యలు = గాలి పేరులు; చనున్ = ఒప్పును.

(కడపటి దీర్ఘసమాసము నిరుపయోగము. కావ్యశృంగారము తలకెక్కిన మీఁది వ్రాతయేమో?)

క. మరుదాఖ్య లొప్పుచుండును
ధర వినుచూలి యనసోఁకు ౹ దయ్యమనం బ
య్యరయన గొట్టన నీఁదనఁ
గరువలి యనఁ దెమ్మెరనఁగ ౹ గాలియనంగన్. **23**

ఈ పద్యము లక్ష్మణకవిగారిది గాక యెవరోచేర్చిన ప్రక్షిప్త భాగమైయుండును.

ధరన్ = భూమిలో; వినుచూలి = ఆకసమునఁ బుట్టినవాఁడు (ఆకాశాత్ వాయు అని ప్రమాణము); అనన్ = అనినను; సోఁకు దయ్యము, అనన్ = స్పర్శన దేవతయనినను; పయ్యెర అనన్ = ప్రయ్యెర రూపమే పయ్యెర-పయ్యెరయనినను; గొట్టు అనన్ = గొట్టు అనినను; ఈఁద అనన్ = ఈదర యనినను; కరువలియనన్ = కరువలి యనినను; తెమ్మెరనఁగన్ = తెమ్మెరయనినను; మరు దాఖ్యలు = గాలిపేళ్లు, ఒప్పుచుండును.

క. ముక్కంటి యనుఁగుఁజెలి వడ
చక్కిలిక చాగకాఁడు ౙ జక్కులదొర బల్
రొక్కమెకిమీఁడు మానిసి
నెక్కుడువాఁడనఁగ జను ధ ౙ నేశుం (డభవా). 24

అభవా = పుట్టుకలేని శంకరా! ముక్కంటియనుఁగుఁజెలి = శివునకు మిత్రుఁడు (రావణాదులు లంకలాగుకొనిన మీఁద శంకరుని తపముచే నాశ్రయించి మిత్రుఁడయ్యెను); వడచక్కిలిక = ఉత్తరమునకు నధిపతి (వడగాడ్పనుచో వేడిగాలియగును. వడచక్కి అనుచో ను త్తరమున నర్థము గ్రామ్యము); చాగకాఁడు = త్యాగశాలి (త్యాగమునకుఁ జాగమని మహాకవిప్రయోగము. అది వికృతియగును); జక్కులదొర = యక్షేశుఁడు. బల్‌రొక్కమెకిమీఁడు = ఎక్కువ ధనముగలవాఁడు (రొక్కమునకు + ఎకిమీఁడు సంధి గమనింపవలెను); మానిసి నెక్కుడువాఁడు = నరుఁడే వాహనముగాఁ గలవాఁడు (ధనముమీఁది వాంఛ మానవులకే యని చూపుట కీ వాహనత్వము); అనఁగ. ధనేశుండు = కుబేరుఁడు; చనున్ = ఒప్పును.

క. విడిముడి గలవేలుపు చెలి
జడముడి జంగంబు గడదె ౙ సం గాపరి యా
యొడయండు పాఁపతొడవుల
నిడియెడి వేల్పనఁగ నొప్పు ౙ నీశానుఁ డిలన్. 25

ఇలన్ = లోకమున; విడిముడిగల = ధనముగల, వేలుపు[1] చెలి = దేవుఁడగు కుబేరుని మిత్రుఁడు; జడముడి జంగంబు = జడలుముడిగాఁగల బిచ్చగాఁడు (జోగి జంగ మను జాతీయము గ్రామ్యము); కడదెసం గాపరియా = ఎనిమిదవదిక్కు గాచువాఁడైన; ఒడయండు = నాయకుఁడు (అష్టమ దిక్పాలకుఁడు) పాఁప తొడవుల నిడియెడు (పాము + తొడవు) పాములే సొమ్ములుగా ధరించు; వేల్పు = దేవుఁడు; అనఁగన్ = అనిన; ఈశానుఁడు; ఒప్పును = అగును.

1. ఉదంత స్త్రీ సమకార్యమిట వదలఁబడినది.



(ఈ పద్యమున శంకరునే కవి యీశానిగాఁ దలంచి సంబుద్ధి కూడ మాని వ్రాసినాఁడు. ఈశానశబ్దము శంకరునకున్నను ఈశ ఐశ్వర్యే యని యైశ్వర్యయు క్తుఁడని చెప్పఁబడినదిగాని దిక్కనిలేదు. ఏకాదశ రుద్రులను గణదేవత లీ దిక్కున కధిపతులని యందురు. రుద్రనామ సామ్యత. వేషమునుబట్టి ధరించి కాఁబోలు. ఏదెటులైన శంకరునికి దిక్పాలకత్వ మిచ్చుట పొరబాటు.)

క. దేవాల యాహ్వాయంబులు
కోవెలయన దేవళంబు ౙ గుడి నా వెలయున్
దేవుళ్ళన జేజేలనఁ
గా వేలుపు లనఁగ వెలయు ౙ క్రతుభుగభిఖ్యల్, 26

కోవెలయనన్ = కోవెలయనినను; దేవళంబు; గుడి; నాన్ = అనఁగా; దేవాలయాహ్వాయంబులు = దేవాలయపుఁ బేళ్ళు; వెలయున్ = ఒప్పును; దేవుళ్ళ + అనన్ = దేవుళ్ళు అనినను; జేజేలు; అనఁగాన్, వేలుపులు; అనఁగా, క్రతుభు గభిఖ్యలు = యజ్ఞములందాహారము దిను దేవతల పేళ్ళు; వెలయును.

ఆ. క్షితినిబేళ్ళు దనరు ౙ సీఁదంపుఁబెద్ద బల్
పాపఱేఁడు వెన్ను ౙ పాను పనఁగ
బుడమితాలుపనఁగ ౙ దడవులనిడుపఁడు
చిలువఱేఁడనంగ ౙ శేషునకును. 27

క్షితిని = ప్రపంచమున; సీంద్రపుఁ బెద్ద = కుబుసముగల పాములలో గొప్పవాఁడు; బల్ పాఁపఱేఁడు = గొప్ప పాములరాజు; వెన్ను పానుపు = (వెన్నుని పానుపు) విష్ణువునకుఁ బడకయైనవాఁడు; పుడమి (ప్ర. పృథివి) తాలుపు = భూమిని భరించువాఁడు; తడవుల నిడుపఁడు = చాలకాలము జీవించువాఁడు; చిలువఱేఁడు = పాములరాజు; అనఁగన్ అనిన ఆదిశేషునకు; పేళ్ళు తనరు = నామము లొప్పును.

క. మరునయ్య తేజి పులుఁగుల
దొర పాములవేటకాఁడు । తూరుపునాఁడేల్
దొరబువ్వఁ గొన్నలావరి
గరుటామంతుఁ డన నొప్పు । గరుడుం (డభవా). 28

మరునయ్యతేజి = మన్మథుని తండ్రికి వాహనమైనవాఁడు; పులుగుల దొర = పక్షులకు రాజు; పాముల వేటకాఁడు = సర్పముల వేటాడువాఁడు; తూరుపునాఁడేల్ = తూర్పు దిక్కును పాలించు; దొరబువ్వన్ = రాజు నాహారమగు నమృతమును; కొన్నలావరి = అపహరించిన బలశాలి (తల్లి దాస్యమునఁగ నితఁడు సర్పములకై యమృతమును హరించెను); గరుటామంతుఁడు = గరుత్ అనిన ఱెక్కలు అవి గలవాఁడు; అనన్ = అనినచో; గరుడుండు, ఒప్పును.

ఆ. నల్లవలువతాల్పు । తెల్లని మైదంట
వెన్నదొంగయన్న । వెఱ్ఱినీళ్ళ
మేలువాఁడు దుక్కి । వాలుదాలుపు తాటి
పడగవాఁ డనంగ । బలుఁడు (రుద్ర). 29

ఈ పద్యమువలన నీ కవి యమరకోశము ననుసరించెననుట స్పష్టమగుచున్నది:—నల్లవలువ తాల్పు = నల్లని బట్టనుగట్టువాఁడు (నీలాంబరుఁడు); తెల్లని మైదంట = తెల్లని దేహమును ధరించువాఁడు; వెన్నదొంగయన్న = శ్రీకృష్ణునికన్న; వెఱ్ఱినీళ్ళ మేలువాఁడు = పిచ్చి గలిగించు నీళ్ళయిన కల్లు త్రాగుటందు అభిలాషగలవాఁడు; దుక్కివాలుదాలుపు = నాగలి ధరించువాఁడు (హలాయుధుఁడు); తాటి పడగవాఁడు = తాటి చెట్టు జండాపైగుర్తుగా గలవాఁడు (తాలాంకుఁడు); అనంగ; బలుఁడు = బలరాముఁడు ఒప్పును.

క. వడముడి యనఁగా గాడుపు
కొడుకన నివి రెండుఁ బేళ్ళ । గుఁ భీమునకుం



బుడమింం గల్జి యనం గ
వ్వడి యన విన్వచ్చుఁడనఁగ । వాసవి (యీశా). 30

ఈ పద్యమువలనఁ బాండవులందలి భీమార్జునులకుఁ గవి ద్వైత్వము నొసంగి యమరసింహుని మించినాఁడు. వడముడి గాడుపుకొడుకు, అను రెండు భీమునకున్, పేళ్ళు, అగున్ = భీముని నామములు. పుడమినిన్ = లోకమునందు; కల్జి = నల్లనివాఁడు[1] అనికను, కవ్వడి సవ్యసాచి (శబ్దభవము) అనినను వాసవి ఇంద్రుని కొడుకు అగును.

తే. వేలుపుల త్రోవ యుప్పర । వీది యాక
సంబు విను విన్ను మిను మిన్ను । చదలు నింగి
దివి మొయిలుదారి చుక్కల । తెరువు బయలు
గాడ్పుతండ్రన నభ మొప్పు । (గరళకంఠ). 31

వేలుపుల త్రోవ = దేవతలు పోవు మార్గము; ఉప్పర వీది = ఆకాశమార్గము; ఆకసంబు = ఆకాశ శబ్దభవము; విను, విన్ను, మిను, మిన్ను; చదలు, నింగి, దివి (ద్యుశబ్ద భవము) మొయిలుదారి = మేఘముల దారి; చుక్కల తెరువు = చుక్కలు తిరుగు మార్గము; బయలు = ఏమిలేనిది; గాడ్పు తండ్రి = గాలి పుట్టినచోటు; అనన్ = అనఁగా; నభము ఒప్పును.

తే. వెలయు ధరణిఁ జతుర్దిశల్ । నలుఁగడ లన
నలరు దచ్చికడ లన ది । శాష్టకంబు
దనరుసీరైదు కడలు నా । దశదిశలును
(మాళిధృత గంగ యంగజ । మదవిభంగ). 32

మాళిధృతగంగ = శిరముపై గంగనుంచుకొనినవాఁడా! అంగజమదవిభంగ = మన్మథుని బొగరడచినవాఁడా! ధరణిన్ = లోకమునందు; చతుర్దిశల్ = నాలుగు దిక్కులు, నలు[2] గడలు; (నాలుగు +

1. ధరణి దుర్లభమైన యవదాతవర్ణము కలవాఁడని భారతము.
2. సమాసంబులందలి నాలుగునకు నలువర్ణకంబగు.

ధృతశరంగ = లేడిని ధరించువాఁడా! ధవళవృషతురంగ = తెల్లని ఎద్దువాహనముగా గలవాఁడా! వలమురి = కుడివైపునకుఁ దిరిగియుండు నది; చుట్టు వాలుజోడు = సుదర్శనమునకు తోడైనది; కల్మికొమ్మమగని బూరగొమ్ము = సంపదలిచ్చు లక్ష్మీదేవి భర్త విష్ణుఁడు గాలినించి వాయించునది; అనఁగ; పాంచజన్యమునకు, అభిఖ్యలు = పేళ్ళు.

తే. రిక్కలనఁ జుక్కలనఁగను ఋక్షములకు
నాఖ్యలై యొప్పుఁ దెఱగంటి యన్నులనఁగ
నచ్చరలనఁగ వేలుపు మచ్చెకంటు
లనఁగ సురకాంతలకు నాఖ్యలగు (గిరీశ). 38

రిక్కలు = (ఋక్షశబ్దభవము) చుక్కలు అనఁగ; ఋక్షములకు = నక్షత్రములకు; ఆఖ్యలై = పేళ్లై. యొప్పును తెఱగంటి అన్నులు, అచ్చరలు, వేలుపు మచ్చెకంటులు, అనఁగ, సురకాంతలకు = దేవతాకాంతలకు; ఆఖ్యలు = పేళ్ళు.

తే. పవలు పగలనఁ బేళ్ళొప్పు దివమునకును
రాత్రిపేళ్ళొప్పు రే రేయి రాతి రనఁగ
వెలయుచుండును రేయెండ వెన్నెలనఁగఁ
జంద్రికకును సమాఖ్యలు (చంద్రమౌళి). 39

పవలు, పగలు, అనఁగ = అనిన; దినమునకు = దినమునకు (దివము = ఆకాశము, పగలు) పేళ్ళు ఒప్పును; రే, రేయి, రాతిరి (రాత్రి శబ్ద భవము) అనునవి రాత్రి పేళ్ళు ఒప్పును; రే యెండ, వెన్నెల, అనఁగ, చంద్రికకు = వెన్నెలకు, సమాఖ్యలు = పేళ్ళు; వెలయుచుండును = ఒప్పును.

క. మించు లన మెఱుపు లనఁగను
జంచలలకుఁ బేళ్ళు దనరు జలధరములు రా
ణించుం బలుకంగ మొయి
ళ్ళంచు మొగుళ్ళంచు మబ్బు లంచుఁ (భర్గా). 41



మించులు, అనఁగ = మెఱపులు, అనఁగా, చంచలలకు = చలించునట్టి మెఱపులకు; పేళ్లు, తనరును మొయిళ్లంచుఁ = మొగుళ్లు, అంచుఁ, మబ్బులు, అంచుఁ, పలుకంగ = చెప్పఁగా; జలధరములు = మేఘములు, రాణించుఁ = ఒప్పును.

క. తొలుచదువులు ప్రాఁజదువులు
దొలుమినుకులు ప్రామినుకులు దొలుపలుకులు ప్రాఁ
బలుకులు పెనుమినుకులు నా
వెలయుఁ శ్రుతులకునుఁ బేళ్లు (విశ్వాధిపతీ). 41

తొలుచదువులు = మొదటి చదువులు; ప్రాఁజదువులు = ప్రాంత చదువులు; తొలుమినుకులు; ప్రామినుకులు; (మినుకు = మినుకుమను కాంతి, వేగము). తొలుపలుకులు; ప్రాఁబలుకులు; పెను మినుకులు; నాఁ = అనఁగా; శ్రుతులకును = వేదములకు; పేళ్లు, వెలయును.

క. ఇది దేవవర్గు దీనిం
జదివిన వ్రాసినను వినిన జనులకు నిత్యా
భ్యుదయంబు లొసఁగుచుండును
వదలక కాశీ నివాస వాసుఁడు ప్రేర్మిన్. 42

ఇది ఫలశ్రుతి పద్యము. పూర్వము మన గ్రంథములు తాటాకులపై వ్రాయఁబడియుండుట నవి శిథిలమగునని వాని నెత్తి వ్రాయుట దివాను గ్రంథమునకుఁ జాత్రత యని కవులు కల్పించిరి.

తా. ఈ దేవవర్గును జదివినవారికిని, వ్రాసినవారికిని, వినినవారికిని కాశీ నివాసుఁడైన శంకరుఁడు ఆదరముతో నిత్యములైన శుభములను వదలక యిచ్చుచుండును.

తే. పాఱుఁ డనఁగఁ బుడమివేల్పు | బాపఁ డనఁగ
జన్నిగట్టన విప్రుండు | జగతిఁ బరఁగు
నొడయఁ డేలిక యెకిమీఁడు | పుడమితేఁడు
తేఁడు దొర సామి యన నొప్పు | నృపతిపేళ్లు, 43

పాఱుఁడు, పుడమివేలుపు (ధరాసురుఁడు) బాపఁడు, జన్నిగట్టు; అనగ = అనిన, జగతిణ = లోకమున; విప్రుండు; పరగు = ఒప్పును, ఒడయఁడు, ఏలిక, ఎకిమీఁడు, పుడమితేఁడు, తేఁడు, దొర, సామి (స్వామిశబ్దభవము) అనగ, నృపతిపేళ్లు = రాజనామములు; ఒప్పును. ఇందు క్షత్రియ వాచకము చెప్పవలసినది. రాజనామములు చెప్పఁబడినవి.

సీ. కోమట్లు మూఁడవ | కొలమువాం డ్రన బేరు
లన వైశ్యనామము | లనరుఁ; గాఁపు
వాండ్రు నా నాలవ | వాండ్రు నా బలిజెవాం
డ్రనఁ జను సూద్రస | మాహ్వయములు;
వడుగు నా గోఁచిబాఁ | పఁడు నాఁగ బ్రహ్మచా
రికిఁ బేళ్ళు నడచు ధ | రిత్రియందు;
నాలుబిడ్డలు గల | యతఁ డిలుతేఁడు గే
స్తన నొప్పుఁ బేళ్ళు గృ | హాధిపతికి;

ఆ. నడవిమనికిపట్టు | జడదారి యన వన
వాసి యొప్పు; నిల్లు | వాసి తిరుగు
జోడ తపసి కావి | పుట్టగోఁచులసామి
యన యతీంద్రుఁ డలరు | (నలికనేత్ర). 44



అలికనేత్ర = నొసటఁగన్నుగల శంకరా! కోమటులు, మూఁడవ కొలమువారు, బేరులు అనగ వైశ్యనామములు తనరు.
గాఁపువాండ్రు, నాలవవాండ్రు = నాల్గవ కులమువారు, బలిజవాండ్రు; అనగ = అనఁగా; శూద్రసమాహ్వయములు = శూద్రులపేళ్ళు; చనుగ = ఒప్పును. వడుగు (వటుశబ్దభవము) గోఁచిబాపఁడు = కౌపీనము ధరించువాఁడు; నాఁగణ = అనిన; బ్రహ్మచారికిణ = బ్రహ్మచర్యము గలవానికి, పేళ్ళు; అలుబిడ్డలుగల యతఁడు, ఇలు తేఁడు = ఇంటికి నధిపతి; గేస్తు (గృహస్థశబ్దభవము) ధరిత్రియందు = భూమియందు; గృహాధిపతికిణ = గృహస్థునకు, పేళ్ళు, ఒప్పును.
అడవి మనికిపట్టు = అడవియే నివాసముగా నుండువాఁడు; జడదారి (జటాధారి) అనగ; వనవాసి = వానప్రస్థుఁడు, ఒప్పును, ఇల్లువాసి తిరుగు = ఇల్లనిలేక తిరుగువాఁడు; జోడ = జోడి చేసికొనినవాఁడు; తపసి (తపస్విశబ్దభవము) కావిపుట్టగోఁచుల సామి — కావిరంగుగల గోఁచిగలవాఁడు అనగ, యతీంద్రుఁడు = సన్న్యాసి; అలరు.

సీ. అమ్మ నాఁ దల్లి నా | నవ్వనాఁ గన్నది
యన మాతృ కాఖ్యలౌ | (నభ్రకేశ)
అబ్బ నాయన యయ్య | యనఁ దండ్రియన నప్ప
యన జనకాఖ్యలౌ | (నగనివేశ)
తోడఁ బుట్టనఁగ సై | దోడు తోఁబుట్టన
సోదరాహ్వయము లౌ | (నాదిదేవ)
భ్రాతృసహోదరు | భార్యకుఁ దోడికో
డ లన నేరా లన | నలరు (నభవ)

తే. చెలియ లనఁ జెల్లె లనఁగను | వెలయుచుండు
నాహ్వయములు కనిష్ఠ క | న్యకకు (గిరీశ)
జ్యేష్ఠకన్యకు నాఖ్యలై | క్షితిని వెలయు
నప్ప యన నక్క యనఁగఁ | (జంద్రార్ధమకుట) 45

అభ్రకేశ = ఆకాశము వెంట్రుకలుగాఁ గలవాఁడా! అమ్మ, తల్లి, అవ్వ, కన్నది, అనఁ = అనిన; మాతృకాఖ్యలు = తల్లిపేళ్ళు. నగనివేశ = కొండవాసముగాఁ గలవాఁడా! అబ్బ, నాయన, అయ్య, తండ్రి, అప్ప, అనిన, జనకాఖ్యలు = తండ్రిపేళ్ళు; ఆదిదేవ = మొదటిదేవుఁడైనవాఁడా! తోడబుట్టు, సైదోడు, తోఁబుట్టు[1], అన సోదరాహ్వాయములు అవును = అన్నదమ్ముల పేళ్ళగును. భర్తృ సహోదర భార్యకు = మగని తోఁబుట్టువు పెండ్లము, తోడికోడలు, ఏరాలు, అని అలరును; కనిష్ఠ కన్యకు = తనకంటె తరువాతఁ బుట్టిన కన్యకు; చెలియలు, చెల్లెలు, అనఁగను, ఆహ్వాయములు = పేళ్ళు, వెలయుచుండును. జ్యేష్ఠకన్యకఁ = తనకంటె ముందు పుట్టిన యాబిడకు, అప్ప, అక్క, అనిన; చంద్రార్ధమకుట = బాలచంద్రుని కిరీటముగాఁ గలవాఁడా! జగతి = లోకమున; ఆఖ్యలై = నామములై, వెలయును.

సీ. ముగ్ధకుఁ బేళ్ళగు ముగుద యనన్ ముద్ద
   రాలు నా గోల నా బేల యనఁగ
గట్టివాయి యనంగ గయ్యాళి యన తాఁగ
   యన ధూర్తసతికి నాహ్వాయము లమరు
నైదువ నాఁగ ము త్తైదువ నా నయి
   దువరాలు నాఁ బుణ్య యువతి వెలయు
మృతజరంటికి నాఖ్య లెసఁగు బేరంటాలు
   నాఁగను జక్కిని నా ధరిత్రి

తే. గేస్తురా లనునాఖ్యచే గృహిణి వెలయు
నాలు పెండ్లాము రాణి యిల్లాలనంగ
భార్య దనరును; దొత్తన బానిసె యన
వరపుడన దాసికాఖ్యలౌ (గరళకంఠ). 4



గరళకంఠ = విషము కంఠమునఁ గలవాఁడా! ముగుద (ముగ్ధశబ్ద భవము) ముద్దరాలు, [1]గోల, బేల అనఁగ, ముగ్ధకు – పేళ్ళు అగును. గట్టివాయి = నోటి బిరుసుగలది, గయ్యాళి, తాఁగ, అనిన, ధూర్తసతికి = గడుసుఁదనముగల స్త్రీకి, ఆహ్వాయములు = పేళ్ళు – అమరును = ఒప్పును (ముగ్ధకు వ్యతిరేకము ప్రౌఢ – ప్రౌఢ లోకవ్యవహారము నెఱిఁగి వర్తించునది) ఐదువ (మంగళసూత్రము, పసుపు, కుంకుమ, గాజులు, చెవ్వాకు అను నైదలంకారములు గలది). ముత్తైదువ (ముత్త = వృద్ధ) అయిదువరాలు, నాఁ = అనిన, పుణ్యయువతి = పుణ్యాంగన (భర్త గలది) వెలయును; పేరంటాలు; జక్కిని (యక్షిణి శబ్దభవము); నాఁగను = అనినను; ధరిత్రిన్ = లోకమున; మృతజిరంటికి = చనిపోయిన సుమంగలికి, ఆఖ్యలు = పేళ్ళు; ఎసఁగును = ఒప్పును; గేస్తురాలు (గృహిణీ శబ్దభవము) అను ఆఖ్యచేఁ = పేరుతో, గృహిణి యొప్పును. ఆలు, పెండ్లాము; రాణి, ఇల్లాలు అనునవి భార్య పేళ్ళు; తొత్తు, బానిసె, వరపుఁడు, అనఁగా దాసికి – సేవకురాలికి, ఆఖ్యలౌఁ = పేళ్ళగును.

సీ. కన్నియ కన్నె నాఁ గన్యఁకు బేళ్ళొప్పు
   జవరాలు కొమరాలు జవ్వని యనఁ
దనరు యువతి; ప్రోఢ యన గట్టివయసుది
   యనఁ బ్రౌఢ దాల్చుసీ యాహ్వాయములు
ముసలి మిండలకోర ముప్పదియాతేండ్లు
   చనినది యను పేళ్ళ నెనయు లోల;
ముసలిది ముదుసలి ముదియ పెద్దన నివి
   యాఖ్యలై తనరు వృద్ధాంగనకును

ఆ. చెడిపె అంకులాడి చెడ్డతొయ్యలి వెలి
చపులు గనిన దనఁగ జార దనరు
నిలను విటులదూత యెడకాఁడు కుంటెన
కాఁ డనంగఁ దనరు (గరళకంఠ) 47

1. తోడ + పుట్టువు – ప్రాతాదుల లుప్తశేషముల కార్యము.

1. వేదాదుల కాలుశబ్దము పరంబగునపుడు రుగాగమము.

కన్నియ; కన్నె ¹నాఁగ = అనిన, కన్యకుఁబేళ్ళు, అగును. (కన్య శబ్దభవము కన్నె); జవరాలు; కొమరాలు, జవ్వని యనిన, యువతి = యవ్వనముగల స్త్రీ; తనరుఁగ = ఒప్పును; ప్రోఢ, (ప్రౌఢ శబ్దభవము) గట్టి వయసుది², వయసు దిగజాఱనిది; అనిన ఈ యాహ్వయములు = ఈ పేళ్ళు ప్రౌఢ తాల్చును. ముసలి, మిండలకోర = అంత తనముగలది; ముప్పదియాఁజేండ్లు చనినది (ఈ పదమునకుఁ బ్రయోగావసరము మృగ్యము) అను పేళ్ళ, లోల = లౌల్యముగలది; ఎనయును = ఒప్పును; ముసలిది, ముదుసలి, ముదియ, పెద్ద (పెద్దది) అనఁగా, ఇవి వృద్ధాంగనకు = ముసలి స్త్రీకి, ఆఖ్యలై తనరు = పేళ్లై యొప్పును; చెడిపె, అంకులాడి, చెడ్డతొయ్యాలి, వెలిచవులు గనినది = ఇతర పురుషుల మఱిగినది అనఁగ, జార = జారిణి, తనరును, (ముసలి మొదలగు పైఁ జెప్పఁబడిన పదములకు నీ పదములకుఁ గల యర్థభేదము గమనింపఁదగినది). విటులదూతే = జారుల తార్పుడుకాఁడు; ఎడకాఁడు = అవకాశమును జూచి వచ్చువాఁడు; కుంటెనకాఁడు = తార్చువాఁడు_అనఁగ_తనరును.

తే. వేల్పుఁబానిస వెలయాలు వేడ్క_కత్తె
లంజె భోగముచాన వెల్లాటకత్తె
పడపుఁజెలి యాటచేడియ గడనకత్తె
నాగ నివి వేశ్య కాఖ్యలౌ (నగనివేళ) **48**

వేల్పుఁబానిస (దేవదాసి), వెలయాలు = ధనముచే నాలగునది; (లేక, వెలి+ ఆలు = వెలయాలు = బయటి స్త్రీ)

వేడ్క_కత్తె³ = వేడుకల గలిగించు స్త్రీ; లంజె, భోగము చాన_(భోగ స్త్రీ) = సుఖములిచ్చునది; వెల్లాటకత్తె = నాట్యమాడునది; పడపుఁజెలి, ఆటచేడియ, గడనకత్తె = సంపాదింప మఱిగినది; నాగ = అనఁగా; ఇవి, వేశ్యకు. ఆఖ్యలు = పేళ్ళు.

ఆ. వెచ్చకాఁడు బొజుఁగు వేడుకకాఁడు మిఁ
డండు ననుపుకాఁడు మిండగీఁడు

1. పదాంతమందలి యొత్వమునకు యాగాగమంబగు, కన్నె కన్నియ.
2. అపదాది స్వరంబులు పరంబులగునపుడు సంధియగు_వయసు + అది.
3. మతుబర్థమునందలి పుంవాచక స్త్రీవాచకములకు కాఁడుకత్తెలగు.



లంజెకాఁడు నా ధ రం జను బల్లవ
నామధేయములు (పినాకహస్త) **49**

పినాకహస్త = పినాకము చేతగలవాఁడా! వెచ్చకాఁడు = ధనమును ధారాళముగ వ్యయపఱచువాఁడు; బొజుఁగు = విటుఁడు; వేడుక కాఁడు = వేడుకలు మఱిగినవాఁడు; మిండఁడు; ననుపుకాఁడు = స్త్రీకి [illegible]ముగ లోఁబడినవాఁడు, మిండగీఁడు; లంజెకాఁడు; నాఁగ = అనిన; ధరను = లోకమున; పల్లవ నామధేయములు = ఇతర స్త్రీల మఱిగినవాని పేళ్ళు; చనుఁగ = ఒప్పును.

సీ. కోడెకాఁడనంగ గోవాడ నాఁగను
యువజనాఖ్య లొప్పు చుండు రెండు
నాగవాస మనఁగ నామహా వేశ్యాజ
నంబు మేళమునకు (నంబికేశ) **50**

కోడెకాఁడు = కోడెవయసు గలవాఁడు; గోవాళ్ళు (గోవ + వారలు) యవ్వనము గలవాఁడు, అనిన; యువజనాఖ్యలు = యవ్వనముం దుండువారి పేళ్ళు.

వేశ్యాజనంబు మేళమునకు = భోగపు స్త్రీల గుంపునకు; నాగవాసమనఁగ, నామమగును.

సీ. నెలఁతుక ప్రాల్గంటి పొలఁతుక ముద్దియ
వాలుఁగంటి మగువ పడఁతి మడఁతి
చెలిమచ్చెకంటి యుగ్మలి యింతి తొయ్యాలి
నవలా కలువకంటి నాతి గోతి
పూఁబోఁడి చిగురాకు బోఁడి పైదలి మించు
బోఁడి ముద్దులగుమ్మ పొలఁతి కొమ్మ
ప్రోయా లువిద తీఁగె బోఁడి చేడియ యించు
బోఁడి యన్ను వెలంది బోటి జోటి

తే. చాన తెఱవ వెలందుక । చామ లేమ
చెలువ యెలనాగ చిలుకల । కొలికి కలికి
తలిరుఁబోఁడి యలరుఁబోఁడి । నెలఁత పొలఁతి
గరిత యతివన స్త్రీసమా । ఖ్యలు (మహేశ) 51

నెలఁతుక, వ్రాల్గంటి = వ్రాలుకన్నులు గలది; పొలఁతుక, (పొలఁతి + ఉక) ముద్దియ, వాలుగంటి, మగువ, పడతి, చెలి, మచ్చెకంటి = చేఁపలవంటి కన్నులు గలది; ఉగ్మలి, ఇంతి, తొయ్యలి, నవల, కలువకంటి = కలువలవంటి కన్నులు గలది; నాతి, గోతి, పూఁబోఁడి[1] (పూవు + మేను) పూవువంటి దేహముగలది; చిగురాఁకుఁబోఁడి = చిగురాకువంటి మేనుగలది; పైదలి, మించుఁబోఁడి = మెఱుపువంటి దేహముగలది, ముద్దులగుమ్మ = మిగుల ముద్దు సేయఁబడునది; పొలఁతి, కొమ్మ = వృక్షమును గొమ్మవలె పురుషు నాశ్రయించునది; ప్రోయాలు, ఉవిద (యువతి శబ్దభవము) తీఁగబోఁడి = తీఁగవలె సన్ననైన దేహముగలది; అన్ను, వెలఁది, బోటి. జోటి. చాన. వెలందుక.(వెలఁది + ఉక), చామ, లేమ. చెలువ; ఎలనాగ, చిలుకలకొలికి = చిలుకముక్కువంటి కనుకొలఁకులు గలది, కలికి, తలిరుఁబోఁడి, అలరుఁబోఁడి, నెలఁత, పొలఁతి, గరిత. అతివ, నాఁ = అనిన; స్త్రీ సమాఖ్యలు = స్త్రీకి పేళ్ళు.

తే. చెలిమి నేస్తంబు పొందు నా । స్నేహమలరు
నెచ్చెలి యనుంగు సంగాతి । నేస్తకాఁడు
సంగడీఁ డనఁ జెలికాఁడ । నంగఁ దనరు
స్నేహితునకు సమాఖ్యలు । (శ్రీమహేశ) 52

చెలిమి, నేస్తము (స్నేహ శబ్దభవము) పొందు. నా = అనిన; స్నేహము = మైత్రి, అలరును. నెచ్చెలి (నెఱ + చెలి = ప్రాతాదుల కార్యము) అనుఁగు; సంగాతి (సాంగత్య శబ్దభవము సంగా

---

1. బహువ్రీహిని స్త్రీ వాచ్యంబగుచో నుపమానంబు మీది మేనునకు పోడి, పోఁణులగు, ఆ పిదప నుగాగమము.



తిగు) నేస్తకాఁడు, సంగడీఁడు, చెలికాఁడు, అనంగ స్నేహితునకు, సమాఖ్యలు = పేళ్లు, తనరును.

సీ. దొంగ తెక్కలికాఁడు । దొరకోలు సన్నాసి
ముచ్చెత్తుబడికాఁడు । ముడియవిడుపు
తెరువాటుకాఁడు క । త్తెర దొంగ చేవాఁడి
కాఁడు వల్లడికాఁడు । కన్నగాఁడు
మునిముచ్చు గడిదొంగ । యనఁ దస్కరాఖ్యలొఁ
జెండిపోతు గరాసు । మొండికట్టె
టకటొంకు టాటోటు । టక్కులాఁడు పిసాళి
టక్కరి ముడికాఁడు । ఠవళికాఁడు

తే. కల్లరియు గొంటు కైలాట । కాఁడు చెడుగు
భేరజము కుచ్చితుఁడు దోస । కారి చెనఁటి
పాలసుఁడు నాలిబూతంబు । వలువ తులువ
కూళ గడుసన వర్తిల్లుఁ । (గుజను పేళ్ళు) 53

దొంగ, తెక్కలికాఁడు = మోసగించి ధన మపహరించువాఁడు, దొరకోలు సన్నాసి = నమ్మించి మోసగించి ధన మపహరించువాఁడు; ముచ్చు = మాటలేక హరించువాఁడు; ఎత్తుబడికాఁడు = ధనమెత్తుకొని పోవువాఁడు; ముడియవిడుపు = ధనపుమూట విడుచుకొని పోవువాఁడు; తెరువాటుకాఁడు = దారిగొట్టువాఁడు; కత్తెరదొంగ = మూటలు సంచులు గత్తిరించుకొని పోవువాఁడు; చేవాడికాఁడు = (చేయి + వాడి) = చేతి మెఱుపుఁ గలవాఁడు; వల్లడికాఁడు = కొల్లగొట్టువాఁడు; కన్నగాఁడు = కన్నము వేయువాఁడు; మునిముచ్చు = మునివలె మాటాడకుండి యపహరించువాఁడు; గడిదొంగ = సామాన్యముగఁ జిక్కనివాఁడు; అనఁ = అనిన; తస్కరాఖ్యలు = దొంగకుఁ బేళ్లు. చెండిపోతు = (చండికనుండి ఏర్పడినది చెండి) విరుద్ధముగ వర్తించువాఁడు; గరాసు = దుష్టస్వభావుఁడు; మొండికట్టె = మొండితనముగలవాఁడు; టకటొంకు, టాటోటు, టక్కులాఁడు, ఈ మూటికిని మోసకారి; కల

నిజము చేయువాఁడని యర్థము చెప్పఁదగును; పిసాళి = దొంగయెత్తులు వేయువాఁడు; టక్కరి = టక్కు చేయువాఁడు; ముడికాఁడు = తంటాలు పెట్టువాఁడు; తవిలికాఁడు = మోసగాఁడు; కల్లరి = అబద్ధాలవాఁడు; గొంటు = దుష్టత్వముచే నొకరికి లొంగనివాఁడు; కైలాటకాఁడు = టాటోటుతేనమున కలవడినవాఁడు; చెడుగు = చెడుపుచేయువాఁడు; బేరజము (డు) = కృత్రిమపు నడతకలవాఁడు; కచ్చితుఁడు = (కత్రిత శబ్దభవము) లోననొకటి వెలుపలనొకటి గలవాఁడు; దోసకారి = పాపమును చేయువాఁడు; చెనటి = మూర్ఖుఁడు; పాలసుఁడు = దోషి; అలిబూతము = (అలికి నాలి యర్థము) నీచమైన వ్యక్తి; పలువ = నోటిబిరుసుగలవాఁడు; తులువ = తుంటరి; కూళ = నీచుఁడు; గడుసు = గడుసైనవాఁడు; అన, కజను పేళ్ళు = దుర్మార్గుని పేర్లు; వర్తిల్లు = ఒప్పును.

ఆ. పాప బుడుత చిఱుత పట్టి సిసువు కందు
కూన నిసువు బిడ్డ కుఱ్ఱ బొట్టె
యనఁగ శిశుసమాఖ్య లగు గొమరుండునాఁ
గొడుకు నాఁ గుమార కుండు వెలయు. 54

పాప, బుడుత = చిన్నవాఁడు; చిఱుత, పట్టి = కొడుకు, సిసువు (శిశు శబ్దభవము) కందు (నెత్తురుకందని ప్రయోగము) కూన, నిసువు (బిడ్డఁడు), కుఱ్ఱ, బొట్టె అనఁగ, శిశుసమాఖ్యలు = శైశవము దాఁటనివాని పేర్లు. కొమరుండు, కొడుకు; నా = అనిన; కుమారకుండు = కౌమారము (16 ఏండ్లు) దాఁటనివాఁడు; లేక పుత్రుఁడు వెలయును.

ఆ. వటుసమాఖ్య లగును వసుధలోఁ గొండిక
వాఁ డనంగఁ బడుచు వాఁ డనఁగను
బిన్నవాఁ డనంగఁ జిన్నవాఁ డనఁగను
(వినుతగుణసనాథ విశ్వనాథ) 55

వినుతగుణసనాథ = పొగడఁదగిన గుణముల కాశ్రయమైనవాఁడా! విశ్వనాథ! = కాశీ విశ్వనాథుఁడా! వసుధలో = ధరణిని; కొండిక



వాఁడు = పడుచువాఁడు, పిన్నవాఁడు, చిన్నవాఁడు, అనఁగ, వటు సమాఖ్యలు = వివాహముగాని బాలునికి పేళ్ళు అగును.

సీ. గిటక పొట్టి కుఱుచ గిట్ట గుజ్జనఁగ వా
మనుఁ డొప్పుఁ; జను నపస్మారిపేళ్ళు
వెడఁగు వేదుఱు వెఱ్ఱి వీఱిఁడి వేటిఁడి
వెంగలి వెంబర విత్తనంగఁ
జతురునకును బేళ్లు జాణ దంట వలంతి
వెరవరి ప్రోడ నేర్పరి యనంగ
ప్రన్ననివాఁడు రూపరి చూడఁగలవాఁడు
చక్కనివాఁడు నా జగతిఁ బరఁగు
తే. సుందరాకారవంతుఁడు సొగసుకాఁడు
వన్నెకాఁ డన శృంగారి వసుధ వెలయు
నంధకుని పేళ్లు చీకు గ్రుడ్డనఁగ మూఁగ
మూవ యన మూకనామముల్ (దేవ దేవ) 56

గిటక, పొట్టి, కుఱుచ, గిట్ట, గుజ్జు (కుబ్జ శబ్దభవము) = ఎత్తుకు పెరుగనివాఁడు; అనఁగ, వామనుఁడు = పొట్టివాఁడు, వెలయును.

వెడఁగు, వేదుఱు, వెఱ్ఱి, వీఱిఁడి, వేటిఁడి, వెంగలి, వెంబరవిత్తు, అనఁగ, అపస్మారి = పిచ్చివాని పేళ్లు.

జాణ, దంట, వలంతి = అన్నిట శక్తుఁడు; వెరవరి = ఉపాయము దెలిసినవాఁడు; ప్రోడ (ప్రౌఢ శబ్దభవము) నేర్పరి, అనంగ, చతురునకు = చాతుర్యము గలవానికి పేళ్ళు

ప్రన్ననివాఁడు, రూపరి, చూడఁగలవాఁడు = చూడఁదగినవాఁడు; చక్కనివాఁడు, నా = అనిన, జగతిని = లోకమున; సుందరాకారవంతుఁడు = సుందరుఁడు; బరఁగును

సొగసుకాఁడు = సొగసుచేసికొనువాఁడు; వన్నెకాఁడు = వర్ణవర్ణములైన వస్త్రములు ధరించువాఁడు; శృంగారి = శృంగారించుకొనువాఁడు.

చీకు, గ్రుడ్డి, అనఁగ అంధుని పేళ్ళు.

నామములు మూఁగ, మూవ. అనిన, మూకనామముల్ = మూఁగవాని పేళ్లు.

క. కాయము పేళ్లై వెలయును
మే యన నొడ లనఁగ మేను ౹ మెయి యన; భోగ్య
ప్రాయము పేళ్ళగుఁ బరువము
పాయము జవ్వన మనంగ ౹ (భావజదమనా) 57

భావజదమనా = మన్మథుని హరించినవాఁడా! మే, ఒడలు, మేను, మెయి, అనిన, కాయము పేళ్లై = దేహనామములై, వెలయును. పరువము, పాయము, జవ్వనము (యౌవనశబ్దభవము) అనంగన్ = అనిన; భోగ్యప్రాయము = సుఖము లనుభవింపఁదగిన వయసు పేళ్ళు అగును.

తే. నెఱులు కురులు వెండ్రుకలు నా ౹ నెఱిక లనఁగఁ
గొప్పు తుఱు మన వేనలి ౹ క్రొవ్వెద యనఁ
గేశధమ్మిల్లములు మించు ౹ గీలుగంటు
క్రొమ్ముడి యనంగ గేశబం ౹ ధమ్ముగు (భవ) 58

నెఱులు = రమ్యమైనవి; కురులు, వెండ్రుకలు, నెఱికలు, కొప్పు తుఱుము, వేనలి, క్రొవ్వెద (క్రొత్త + వెద = కొప్పు) అనన్ = అనిన; కేశధమ్మిల్లములు = (స్త్రీల) వెండ్రుకల ముడి; మించున్ = ఒప్పును; కీలుగంటు = జాఱుముడి; క్రొమ్ము[1]డి = (క్రొత్త + ముడి) అనఁగ – కేశబంధము = వెండ్రుకల ముడికి పేళ్ళు.

తే. నొసలు నెన్నొసల్ నుదురు నె ౹ న్నుదురనంగఁ
దనరు ఫాలంబు; చూడ్కి – చూ ౹ పనఁగ నొప్పు
నాహ్వాయము లీక్షణమునకు; ౹ నక్షికాఖ్య
లలరుఁ గన్ గను కన్ను నా ౹ (నభకేశ) 59

1. క్రొత్తాదుల యాద్యక్షర శేషములకు వ మ న – లు పరములైన ద్విత్వము మాత్రము కానంబడును.



నొసలు, నెన్నొసలు (నెఱి + నొసలు) నుదురు, నెన్నుదురు (నెఱి + నుదురు) అనఁగ, ఫాలంబు = ఫాలభాగము, తనరు. చూడ్కి, చూపు, అనఁగ, ఈక్షణమునకున్ = చూపునకు, ఆహ్వాయములు = పేళ్లు, కన్, కను, కన్ను (నువర్ణకము ద్రుతమాత్రముగ గ్రహించుటవలన నీ రూపము లేర్పడినవి); నాన్ = అనిన; అక్షికిన్ = కంటికి; ఆఖ్యలు = పేళ్ళు.

క. వీను లనఁ జెవు లనంగా
జానుఁగు లన నాహ్వాయములు ౹ శ్రవణంబులకున్
గౌ నన నడు మనఁగా నభి
ధానము లగు మధ్యమునకుఁ ౹ (దరుణేందుధరా) 60

తరుణ + ఇందు + ధరా = లేత చంద్రుని ధరించువాఁడా! వీనులు, చెవులు, జానుఁగులు, శ్రవణంబునకున్ = చెవికి; ఆహ్వాయములు = పేళ్ళు గౌను, నడుము మధ్యమునకు నభిధానములు = పేర్లు.

తే. అక్కు – ఱొమ్మెద బోర నా ౹ నలరు వక్ష
మాస్యమున కొప్పుచుండునా ౹ ఖ్యలు మొగంబు
మోర మో మనఁ; బేళ్ళొప్పు ౹ నూరువునకుఁ
బెందొడ యనంగఁ గుఱువు నా ౹ (నందివాహ) 61

అక్కు, (వక్షశబ్దభవము) ఱొమ్ము, ఎద (హృదయశబ్దభవము), బోర నాన్ = బోర అనిన, వక్షము, అలరును. మొగము (ముఖము ప్రకృతి) మోర, మోము, అనఁగా, ఆస్యమునకున్ = ముఖమునకు, ఆఖ్యలు = పేర్లు; ఒప్పుచుండును. పెందొడ (పెద్ద + తొడ) కుఱువు; నా = అనిన; ఊరువునకు పేర్లు, ఒప్పును.

తే. వదనగుహ యొప్పు నోరు నా ౹ వాయి యనఁగఁ
బల్లు పలు నాఁగ దంతంబు ౹ పేళ్లు వెలయుఁ
బెదవి వాతెఱ మోవి య ౹ న్పేళ్ళఁ దనరు
చుండు నోష్ఠంబు (శీతాంశు ౹ ఖండమౌళి) 62

నోరు, వాయి; నాన్ = అనఁగా; వదనగుహ = ముఖమునందలి బొరియ, ఒప్పును పల్లు, పలు; నాఁగ = అనినచో, దంతంబు, పేర్లు వెలయును. పెదవి, వాతెఱ (వాయి + తెఱ) = నోటికి తెఱవంటిది, మోవి; అన్పేర్లన్ = అను నామములతో; ఓష్ఠంబు తనరుచుండును.

క. కయి యనఁ గై నాఁ గేలనఁ
జెయి యనఁ జై నాఁగఁ జెయ్యి చేనా హస్తా
హ్వయము లగు (నన్నపూర్ణా
ప్రియవల్లభ కాశికాపురీవరనిలయా) **63**

అన్నపూర్ణాప్రియవల్లభ! = అన్నపూర్ణాదేవికిఁ బ్రియుఁడైన వాఁడా! కాశికాపురీవరనిలయా = శ్రేష్ఠమైన కాశి నివాసముఁగా గల వాఁడా! కయి, కై, కేలు, చెయి, చై, చెయ్యి; నాన్ = అనిన; హస్తమునకు, సమాఖ్యలు = పేర్లు; ఐ, అయిగా మారుట గ్రాహ్యము.

క. ఎద యన డెందం బనఁగా
మదియనఁగా నెడఁదనంగ మఱి యుల్లమునా
హృదయమునకు నివి యెసఁగును
విదితంబుగ నాహ్వయములు (విశ్వాధిపతీ) **64**

ఎద, డెందము, మది, ఎడఁద; ఉల్లము, నా = అనఁగా; ఇవి, విదితంబుగ = నెల్లరకుఁ దెలియునట్లు; హృదయమునకున్ = (హృదయము) మనస్సునకు, పేర్లు. ఎసంగును = ఒప్పును.
నకుఁ గూడ నివి పర్యాయములుగాఁ జెప్పనగును).

క. లోఁజెయ్యన నఱచెయ్యనఁ
గాఁ జెల్లును బేళ్లు రెండు కరతలమునకున్
మీఁజెయ్యనఁ బెడచెయ్యియు
నాఁ జనుఁ గరచరమభాగ నామములు (శివా) **65**



లోఁజెయ్యి (లోన్ + చెయ్యి) = చేతి లోపలిభాగము; అఱచెయ్యి అన, కరతలమునకున్ = చేతి లోపలి భాగమునకు, రెండు పేర్లు.
మీఁజెయ్యి = (మీఁది + చెయ్యి) పెడచెయ్యి; నాన్ = అనిన; కరచరమ భాగమునకు = చేతి పైభాగమునకు నామములు.

ఆ. పొట్ట డొక్క కడుపు బొజ్జ బొట్టయనంగ
నొప్పుచుండు నాఖ్య లుదరమునకు
నాభిబిలమునకును నామధేయము లగు
బొడ్డు నాఁగ మఱియుఁ బొక్కిలనఁగ. **66**

పొట్ట, డొక్క, కడుపు, బొజ్జ, బొట్ట, అనఁగ, ఉదరమునకున్ = కడుపునకు ఆఖ్యలు = పేర్లు, ఒప్పుచుండును. బొడ్డు, పొక్కిలి, అనఁగ, నాభి బిలమునకును = బొఱియవంటిదైన బొడ్డునకు; నామధేయములు = పేళ్ళు. (ఈ పద్యమునందు నిత్యసంధి గమనించి పదములు విడఁదీయ వలయును.)

తే. వెన్ను నంగను వీఁపు నా వెనుక మేను
నాఁగఁ జరమాంగమున కొప్పు నామములుగఁ
బుఱ్ఱె తలపాల నాఁ బుఱ్ఱ పుఱియ నాఁగ
పాలమున కాఖ్యలై యొప్పు (ఫాలనేత్ర) **67**

వెన్ను, వీఁపు, వెనుకమేను = దేహపు వెనుకభాగము; నాన్ = అనినఁ జరమాంగమునకున్ = వీఁపునకు; నామములుగ, ఒప్పును. పుఱ్ఱె, తలపాల, పుఱుక. పుఱియ; నాఁగన్ = అనిన; కపాలమునకు = తల పైభాగమునకు; ఆఖ్యలై ఒప్పున్ = పేళ్లగును.

క. అసు గంజ హజ్జ యనఁగాఁ
బుడమిఁ బదంబునకు నామములు విలసిల్లున్
మడ కుత్తు కట్టు గొంతన
నడరు గళంబునకుఁ బే (ళ్ళు సంగధ్వంసీ) **68**

అడుగు, అంజ, హజ్జ, పుడమిజ్ఞ = లోకముప; పదంబునప, నామ
ములు. మెడ, కత్తుక, అఱ్ఱు, గొంతు, గళమునకజ్ఞ = మెడకు
పేళ్ళు. అడరును

ఆ. బువ్వ వంటకంబు ౹ బోనంబు మెతుకు కూ
డోగిరము పసాద ౹ మోరె మనఁగ
నన్న మొప్పుఁ; జేల ౹ మలరుఁ బుట్టంబు దు
వ్వలువ చీర కోక ౹ వలువయనఁగ. 6

బువ్వ, వంటకము, బోనము (ప్ర–భోజనము), మెతుకు, కూడు
ఓగిరము, పసాదము (ప్ర–ప్రసాదము), ఓరెము, అనఁగ, అన్నము; ఒప్పును
పుట్టము, దువ్వలువ, చీర, కోక, వలువ, అనఁగ, చేలము =
వస్త్రము; అలరును.

తే. మెసవె నారోగిణ మొనర్చె ౹ మెక్కెఁ దినియెఁ
గుడిచె నారగించెను బసా ౹ పడియె నమలె
సాపడె ననంగ నొప్పు భో ౹ జనము సేసె
ననుట కివి యాఖ్యలై (యీశ ౹ యభ్రకేశ) 7

మెసవెను. ఆరోగిణ మొనర్చెను, మెక్కెను, తినియెను. కుడిచెను
ఆరగించెను, పసాపడియెను. (ప్రసాదము + సాపడు), నమలెను, సా
పడెను, అనంగ, భోజనము చేసెననుటకు ఇవి, ఆఖ్యలు = పేళ్ళు

క. నాన యన సిగ్గు సిబ్బితి
నా నివి వ్రీడాపదంబు ౹ నామంబు లగుం
బానము సేయుట పేళ్ళగు
నానుట త్రావుటనఁ ద్రాగు ౹ టనఁ గ్రోలుటనన్. 7

నాన, సిగ్గు, సిబ్బితి; నాజ్ఞ ఇవి = అను ఇవి; వ్రీడాపదంబు
నామంబులు = సిగ్గను పదమునకు బర్యాయములు, ఆనుట, త్రావుట
త్రాగుట (క్వచిద్గకారో వః యని సూత్రము) క్రోలుట, అనఁగా, (మదా
దులు) పానము సేయుటకు = త్రాగుటకు, పేళ్ళు



ఆ. తళియ పళ్లెరంబు ౹ తెళె హరివాణంబు
తట్ట కంచ మనఁగఁ ౹ దనరుఁ బాత్ర;
చెల్లుఁ జషకమునకుఁ ౹ బేళ్లు డబ్బుర కోర
గిన్నె యనఁగ (రజత ౹ గిరినివాస!) 72

భోజనపాత్రము = భుజించుపాత్ర, తళియ, పళ్లెరము, తెళె, హరి
వాణము, తట్ట, కంచము, అనఁగా తనరును, డబుర్ర,
కోర, గిన్నె అనఁగా చషకమునకజ్ఞ = గిన్నియకు, పేళ్లు దనరును–
cup.

తే. నతికిఁ బేళ్లొప్పు జోత దం ౹ డం జొహారు
మ్రొక్కు జేజే యనంగఁ; గేల్ ౹ మొగిచెఁ గొలిచె
నెఱఁగెఁ జేమోడ్చె నన నమ ౹ స్కృతియొనర్చె
ననుట కివి యాఖ్యలగు (నీశ! ౹ యభ్రకేశ!) 73

నతికిజ్ఞ = నమస్కారమునకు, జోత, దండము, జొహారు,
మ్రొక్కు, జేజే, అనఁగను, పేళ్ళు. కేల్
మొగిచె = చేతులుజోడించెను, కొలిచెను, ఎఱగెను, చేమోడ్చెను (చేయి +
మోడ్చెను) అనఁగ, ఇవి నమస్కృతియొనర్చెజ్ఞ = నమస్కారము చేసెను,
అనుటకు, ఆఖ్యలు = పేళ్ళు.

తే. ఒప్పు శయనించుటకును బ ౹ వ్వళించెఁ బండెఁ
బవ్వడించెఁ బరుండెను ౹ బవ్వళించె
నత్తమిల్లె నన న్నిటి ౹ మెత్త సెజ
పఱుపు పాన్పనఁ దగు శయ్య ౹ (ఫాలనేత్ర!) 74

శయనించుటకును = పరుండుటకు, పన్నుండె, పండెను, పవ్వ
ళించెను, (శ, డల కభేదము) పరుండెను; పవ్వళించెను, నత్తమిల్లెను,
అనఁగా పేళ్ళు, అగును. మెత్త, సెజ (శయ్యా – ప్ర) పఱుపు,
పాన్పు, అన, శయ్య = పడక, తగును,

తే. ఒప్పు ధ్వనిపేళ్లు రొద యన నులివు నాఁగ
సద్దనంగను గూఁత నాఁ జప్పుడనఁగ
నలుకు డన; రోదనము సేసె ననుట కాఖ్య
లెసఁగు నఱచెను వాపోయె నేడ్చె ననఁగ 75

ధ్వనిపేళ్ళు = శబ్దమునకుఁ బేళ్లు; రొద, ఉలివు, సద్దు (శబ్దము-ప్ర) కూఁత; చప్పుడు, అలుకుడు అనఁగా, తనరు. అఱచెను. (ఇది బిగ్గఱశబ్దమునకుఁ బేరగును) వాపోయెను = (నోరువిడచి యఱచెను) ఏడ్చెను, అనఁగ రోదనముచేసెను = ఏడ్చెను. అనుటకు, ఆఖ్యలు = పేళ్ళు

క. అగుఁ బేళ్లు నీరువట్టన
దగ దప్పియు దూప యనఁగ దాహంబునకున్
నగవు నగు నవ్వు నవు నా
నగునాఖ్యలు హాసమునకు (నగజాధీశా!) 76

నగజ అధీశా! = పార్వతికిఁ బతియైనవాఁడా! నీరువట్టు, దగ, దప్పి, దూప, అనఁగ, దాహంబునకున్ = దప్పికి, పేళ్ళు, అగును నగవు, నవ్వు, నగు, నవు, నాన్ = అనఁగ, హాసమునకున్ = నవ్వునకు, ఆఖ్యలు = పేళ్ళు.

క. చాగము నాఁ బుడు కనఁగా
నీగి యనఁగ నిడుట యనఁగ నీవి యనంగాఁ
దేగము నాఁ బెట్టుడు నా
ద్యాగమునకు నాఖ్య లగుచు ధరఁబరఁగు (శివా!)

చాగము, పుడుకు, ఈగి, ఇడుట, ఈవి, తేగము (త్యాగము-ప్ర) పెట్టుడు (పెట్టుధాతువు) నా = అనఁగ, త్యాగమునన్ = ఉదారముగ నిచ్చుటకు, ఆఖ్యలు అగును.

ఆ. ఎలసె బెరసె హత్తె నెనసె నదికెఁ జెందెఁ
బొందె దొరసెఁ గూడె నొండెఁ జెనకె



ననఁగ సక్తమయ్యె ననుటకు నివి యాఖ్య
లగు (గిరీశ! యీశ! యభ్రకేశ!) 78

ఎలసెను, బెరసెను, హత్తెను, ఎనసెను, అదికెను, చెందెను, పొందెను, దొరసెను, కూడెను, ఒండెను, చెనకెను, అనఁగా, సక్తమయ్యెను = కూడుకొనెను, అనుటకు, ఇవి, ఆఖ్యలు = పేళ్ళు.

ఆ. ఎడసెఁ బాసె వేఱుపడెఁ బురివిచ్చె నా
నలరు భేదమయ్యె ననుట పేళ్లు
స్వవశమయ్యె ననుట కవుఁ బేళ్లు లోనయ్యె
నగ్గమయ్యె ననఁగ (నసమనేత్ర!) 79

అసమనేత్ర = విషమమైన కన్నులుగలవాఁడా! ఎడసెను, పాసెను, వేఱుపడియెను, పురివిచ్చెను = (కలిసియుండి విడిపోయెను) నా=అనిన, భేదమయ్యెన్ = విడిచిపోయెననుటకు, పేళ్ళు.
లోనయ్యెను (లోఁపడియెను) అగ్గమయ్యెను = సాధ్యమయ్యెను, అనఁగ, స్వవశమయ్యెను = స్వాధీనమయ్యెను అనుటకు, పేళ్ళు, అవును,

ఆ. అగు గృహీతమయ్యె ననుటకుఁ బేళ్లగ
పడియెఁ జేపడియెను బట్టువడియెఁ
జిక్కువడియెఁ దగిలెఁ జిక్కెఁ దగుల్పడె
ననఁగ (నగనివేశ! యభ్రకేశ!) 80

నగనివేశ! = కొండనివాసముగాఁ గలవాఁడా! అభ్రకేశ!=ఆకసము కురులుగాఁ గలవాఁడా! అగపడియెను, చేపడియెను, పట్టువడియెను, చిక్కువడియెను, తగిలెను, చిక్కెను, తగుల్పడియెను, అనఁగ, గృహీతమయ్యెను = పొందఁబడియెను. అనుటకు పేళ్ళు, అగును.

తే. అనియె నొడివె వక్కాణించె నాడెఁ జెప్పె
వినిచె వాక్రుచ్చెఁ బలికె నాఁ జను వచించె

ననుట; కాలించె నాలకిం ॥ చెను విని నన
నలరు నవధరించె నటంట ॥ కాఖ్య (లీశ!) **81**

అనియెను, నొడివెను, వక్కాణించెను, అడెను, చెప్పెను విని చెను (వినుచు = వినిపించు) వాక్రుచ్చెను, పలికెను, నార్ = అనిన, వచించెను = చెప్పెను, అనుటకు, ఆఖ్యలై = పేళ్లై, చనును; ఆలించెను, ఆలకించెను, వినెను, అవధరించెను = వినెను, అటంటకు = అనుటకు ఆఖ్యలై అలరును.

క. కనియెను చూచెను కాంచెను
కనుఁగొనెఁ గన్గొనె ననంగఁ ॥ గలయవి పేళ్లై
చను వీక్షించె నటంటకు
(ఘనతరగోరాజగమన! ॥ కాయజదమనా!) **82**

ఘనతర = గొప్పదైన, గోరాజగమన! = వృషభముపైఁ బోవువాఁడా! కాయజదమనా! = మన్మథునిదమించినవాఁడా! కనియెను, చూచెను, కాంచెను, కనుఁగొనెను, కన్గొనెను, అనంగను, వీక్షించెను = ఆలోకించెను, అనుటకు, పేళ్లై చనును.

క. చనుఁ గృతగమనుఁడ నయ్యెద
ననుటకు నామంబు లగుచు ॥ నవని నరిగెదర్
జనియెదఁ బోయెద నేఁగెద
పనివినియెద ననెడునట్టి ॥ పలుకులు (రుద్రా!) **83**

కృతగమనుఁడను = చేయఁబడిన నడకగలవాఁడను, అనుటకు, అరిగెదను, చనియెదను, పోయెదను, ఏఁగెదను, పనివినియెదను, అనెడు. పలుకులు, నామములు, అగును.

ఆ. ద్విగుణమున కభిఖ్య ॥ లగు నిబ్బడిమ్మడి
జంట దంట దుగయు ॥ జమిలి రెట్టి
యినుమడి యన మిథున ॥ మునకాఖ్యలగు జోడు
దోయి కవ యనంగ ॥ (ధూతకలుష!) **84**



ధూతకలుష = ఎగురఁగొట్టఁబడిన పాపముగలవాఁడా! ఇబ్బడి, ఇమ్మడి, జంట, దంట, దుగయు, జమిలి, రెట్టి, ఇనుమడి అనఁగా, ద్విగుణమునకు = రెట్టింపునకు, ఆఖ్యలు = నామములు జోడు, దోయి, కవ, అనఁగా, మిథునమునకు = జంటగా నుండుటకు, పేళ్ళు

సీ. ఒం డొకఁ డొకటి యొ ॥ క్కొండన నగు నేక
మీరు రెం డిరు నాఁగ ॥ నెసఁగు ద్వయము
తిగ మూఁడు మూర్నాఁగఁ ॥ దగు త్రయి; తీవంచ
నలు నాల్గు చౌ యన ॥ నగుఁ జతుష్క-
మెసఁగుఁ జౌవంచ యై ॥ దేనన బంచకం
బా; తిరుమూఁ డి త్తి ॥ గనఁగ నొప్పు
షట్కంబు; ఋషిసంఖ్య ॥ నత చక్కవగడ యే
డన నొప్పు; సప్తసం ॥ ఖ్యకును బేళ్లు
తే. తనరు నిరునాలు గెనిమిది ॥ దచ్చి యనఁగ
బరఁగు నీరాఱు పన్రెండు ॥ బార యనఁగ
ద్వాదశమునకు నాఖ్యలు ॥ ధరణియందు
(వినుతకరుణాసనాథ! శ్రీ ॥ విశ్వనాథ!) **85**

ఒండు, ఒంటి, ఒక్కండు, అనఁగా ఏకము = ఒకటి అగును. ఈరు, రెండు, ఇరు, అనిన; ద్వయము = రెండు, ఎసఁగును తిగ, మూఁడు, మూరు; నాఁగ = అనిన, త్రయి = మూఁడు, తగును. తీవంచ, నలు, నాల్గు, చౌ అనఁగ; చతుష్కము = నాలుగు ఎసఁగును చౌవంచ, ఏను, ఐదు, అనఁగా పంచకము = అయిదు ఆఱు, ఇరు, మూఁడు, ఇత్తిగ (ఇరు + తిగ) అనఁగ, షట్కంబు = ఆఱు, ఒప్పును నత (సప్త - ప్ర) చక్కవడగ, ఏడు, అనఁగా; ఋషిసంఖ్య = ఏడు; ఒప్పును. ఇరునాలుగు, ఎనిమిది, దచ్చి అనఁగ, ఎనిమిదిపరగును.

ఈరాలు = (రెండు ఆఱులు) బార(తురష్కపదము బారా) అనఁగ ద్వాదశము = పం(డ్రెండుకు, ఆఖ్యలు = పేళ్ళు,

తే. జరిగె నూడెను జాఱెను నుఱికె వెళ్లెఁ
బాఱెఁ బఱచెను దొలఁగె న న్వలుకు లెల్ల
నవనిలోనఁ బలాయితుం డయ్యె ననుట
కాఖ్యలై యొప్పుఁ (జంద్ర శేఖరావతంస!) 86

1. జరిగెను, 2. ఊడెను, 3. జాఱెను, ఉఱికెను. వెళ్లెను, పాఱెను, పఱచెను, 4. తొలఁగెను. అప్పలుకులెల్ల = ఈ మాట లన్నియు పలాయితుఁడు అయ్యెను = పఱుగిడెననుటకు, ఆఖ్యలై = పేళ్లై, ఒప్పును, (కాని 1, 2, 3, 4, పదములకు కడలెనను సందర్భములందు (ప్రయోగము గలదు.

క. వేంచేసెను వచ్చేం జను
దెంచెను విచ్చేసె నరుగు దెంచె ననఁగ నే
తెంచె నన నయ్యె నాగతుఁ
డంచుం బలుకుటకు నాఖ్య (లంబర కేశా!) 87

వేంచేసెను, వచ్చెను, చనుదెంచెను, విచ్చేసెను, నరుగుదెం[2]చెను, ఏతెంచెను (ఏఁగు + తెంచు) అనఁగ, ఆగతుఁడు + అంచు = వచ్చిన వాఁడు అని, పలుకుటకు ఆఖ్యలు = పేళ్ళు,

తే. నాఁటసుత నాఁటనుండియు నాఁటఁగోలె
నాఁటఁబట్టి నాఁడుమొదలు నాఁగ నాహ్వ
యమ్ము లయ్యెఁ దదారభ్య యనుట కవని
(వినుత కరుణాసనాథ: శ్రీ విశ్వనాథ!) 88

1. అరుగ్వాదులకుఁ దెంచు ధాతువగు. అగుచో నుకారంబుమీఁది దాని తకారంబునకుఁ దకారంబగు. 2. అరుగు + తెంచు = అరుగుదెంచు.



నాఁటినుత; నాఁటినుండి; నాఁటఁగోలె; నాఁటఁబట్టి; నాఁడు మొదలు; నాఁగ = అనఁగా; తదారభ్య = అది మొదలు! అనుటకు, ఆఖ్యలు,

తే. వైరమునకును ధర సమాహ్వాయము లమరుఁ
గంటు పగ మచ్చరంబు సూడొంటమి యన
వలపు కూరిమి మేలు నా నలరుఁ బేళ్లు
మోహమునకును (శారదాంబుదనిభాంగ!) 89

శారదాంబుద = శరత్కాల మేఘమువలె; నిభ = ప్రకాశించెడు; అంగ = దేహముగలవాఁడా; వైరమునకు = విరోధమునకు; కంటు; పగ, మచ్చరము - (మత్సరము-ప్ర) సూడు; ఒంటమి = సరిపడకపోవుట అనునవి సమాహ్వాయములు = పేళ్ళు; తనరును. మోహమునకు = అపేక్షకును; (ప్రేమకు) వలపు; కూరిమి; మేలు; నా = అనిన పేర్లు అలరును.

క. పెనఁకువ జగడము కయ్యం
బని బవరము కలను చివ్వ యాలము పోట్లా
టన దురము పోరు నాఁగాఁ
జను యుద్ధంబునకుఁ బేళ్లు (చంద్రార్ధధరా!) 90

పెనఁకువ; జగడము; కయ్యము (కలహము-ప్ర) అని; బవరము; కలను, చివ్వ, ఆలము, పోట్లాట, దురము, పోరు; నాఁగా = అనఁగా యుద్ధంబునకు; పేళ్ళు; తనరును. (వాచామూలకము పెనఁకువ; జగడము, పోట్లాట యనఁబడుచున్నది.)

ఆ. సదమదంబు సేసెఁ జక్కాడె నుగ్గాడెఁ
జదిపెఁ బీఁచమడఁచెఁ జంపెఁ గెడపె
నుఱుముసేసెఁ ద్రుంచెఁ బరిమార్చెఁ దెగటార్చె
మన్నిగొనియెఁ దునిమె మడిపె ననఁగ. 91

తే. హతము గావించె ననుటకు ƒ నాఖ్య లయ్యె
మనిపె నేలెను బ్రతికించె ƒ మంచెఁ బ్రోచె
సాకె నన నొప్పు నాఖ్యలు ƒ సరవితోడ
నరయఁ బోషించె ననుటకు ƒ (నంబికేశ!) **92**

వధమదముచేసెను, చక్కాడెను; నుగ్గాడెను; చదిపెను; పీఁచ మడఁచెను; చంపెను; కడపెను; నుఱుముచేసెను; త్రుంచెను; పరిమార్చెను; లెగటార్చెను; మన్నిగొనియెను; తునిమెను (తునియుధాతువు) మడిపెను (మడియు ధాతువు) అనఁగ హతముగావించెను = చంపెను; అనుటకు ఆఖ్యలు; అయ్యెను. మనిపెను; ఏలెను; బ్రతికించెను; మంచెను (మనుచు - మంచు) బ్రోఁచెను; సాకెను; అన; సరవితోడ-అపేక్షతో; పోషించెను = పెంచెను; అనుటకు; ఆఖ్యలు;

క. ధరలో శూరాహ్వాయములు
పరఁగున్ మొనకాఁ డనంగ ƒ బంటనఁగాఁ బో
టరి యన వడిగలవాఁ డన
బిరు దన వాఁడిమగఁ డనఁగ ƒ (భీమకపర్ది!) **93**

భీమ - (పాపులకు) భయంకరమైనవాఁడా! కపర్దీ = కపర్దమను జటాజూటము గలవాఁడా! మొనకాఁడు = ముందుండువాఁడు; బంటు (భటుఁడు-ప్ర) పోటరి = శౌర్యముగలవాఁడు; వడిగలవాఁడు = వేగము గలవాఁడు; బిరుదు; వాఁడిమగఁడు = వాడిగల మగవాఁడు; అన శూరాహ్వాయములు = శూరుని పేళ్ళు.

తే. బాసట యనంగఁ దోడ్పాటు ƒ నా సమాహ్వా
యంబు లగుచుండు రెండు సా ƒ హాయ్యమునకు
నాఖ్యలు శుభంబునకును ల ƒ గ్గనఁగ బాగ
నంగ మేలల లెస్సయ ƒ నంగ (నీశ!) **94**



బాస, తోడ్పాటు అనఁగా, సాహాయ్యమునకు పేళ్ళు
లగ్గు, బాగు, మేలు, లెస్స అనఁగా శుభమునకు = మంచికి పేళ్ళు.

ఆ. కూలె నీల్గెఁ జచ్చెఁ ƒ గాలంబు సేసెను
గడసె సమసె నాఱె ƒ మడిసెఁ జెల్లెఁ
బెద్దనిదురవోయె ƒ బిద్దె దోరెను గంతు
గొనియె ననుట పేళ్ల ƒ గును మృతునకు **95**

కూలెను, ఈల్గెను, చచ్చెను, కాలంబుచేసెను, కడసెను(కడయు-ధాతువు) సమసెను; అఱెను; మడిసెను, చెల్లెను, పెద్ద నిదురపోయెను; బిద్దెను; దోరెను; గంతుగొనియెను అనుట; మృతునకు = చనిపోయిన వానికి; పేళ్లు అగును.

సీ. తిమ్మనైనది యనఁ ƒ దిన్ననైనది యన
జానైన దనఁగ బా ƒ గైన దనఁగ
నాణెమైన దన వి ƒ న్నాణమైనది యన
మానైన దనఁగ లె ƒ స్సైన దనఁగ
బిన్ననైనది యనఁ ƒ జెన్నైన దన నలు
వైనది యనఁగ జె ƒ ల్వైన దనఁగఁ
బొనరినయది యన ƒ నొనరిన దనఁగఁ జొ
క్కటమైన దనఁగఁ జ ƒ క్కని దనంగ
సొబగైన దనఁగను ƒ సొంపైన దనఁ గొమ
రైనది యన గొన ƒ బైన దనఁగ
దోరమైన దన సిం ƒ గారమైనదన మే
లైన దనంగ మె ƒ చ్చైన దనఁగ

తే. మురువుగలయది యొప్పైన ౼ నొఱపుగలది
యందమైనది తనరిన ౼ దలరినట్టి
దనఁగఁ బరఁగినఁ బేరులు ౼ తనరుచుండు
మంజులంబైన దనుటకు ౼ (మదనదమన!) **96**

తిమ్మనైనది, తిన్ననైనది; జానైనది; బాగైనది; నాణెమైనది; విన్నాణమైనది; మానైనది; (మాన్యమైనది) లెస్సైనది; పిన్ననైనది; చెన్నైనది = సొగసైనది; నలువైనది; చెల్వైనది; పొసగినది = ఒప్పిదమైనది; ఒనరిది; చొక్కటమైనది; చక్కనిది; సొబగైనది; సొంపైనది; కొమరైనది; గొనబైనది; తోరమైనది (స్థూలము-(ప్ర)-తోరము (వి) - సింగారమైనది - (శృంగారము-(ప్ర) మేలైనది; మెచ్చైనది = మెచ్చుకోఁదగినది; మురువుగలయది; ఒప్పైనది; ఒఱపుగలది; అందమైనది; తనరినది; తలరినట్టిది; పరగినది; అనఁగా; మంజులమైనది = మనోహరమైనది; అనుటకు; పేళ్ళు.

తే. కపుర మనఁ గప్పురం బనఁ ౼ గప్ర మనఁగ
బుడమిఁ గర్పూర మొప్పుఁ దాం ౼ బూల మొప్పు
వీడియము వక్కలాకులు ౼ విడెము తమ్ము
లంబు వీడెంబు వీడ్య మ ౼ నం (బురారి!) **97**

కపురము; కప్పురము; క్రపము; అనఁగా కర్పూరము ఒప్పును. వీడియము; వక్కలాకులు (వేసికొనుట) విడెము. తమ్ములము; వీడ్యము; అనఁగా; తాంబూలము; ఒప్పును.

తే. వెలయు చుండును సిరి లచ్చి ౼ కలిమి యనెడు
పేళ్ల సంపద; యెద్దడి ౼ పేదఱికము
లేమి నిప్పచ్చరము నెవ్వ ౼ లేమి డనఁగ
నలరు దారిద్ర్యమునకు నా ౼ ఖ్యలు (గిరీశ!) **98**



సిరి (శ్రీ-(ప్ర) లచ్చి; కలిమి; అనెడు పేళ్ళతో సంపద = ఐశ్వర్యము; వెలయుచుండును. ఎద్దడి; పేదఱికము; లేమి = లేకపోవుట; నిప్పచ్చరము; నెవ్వ; లేమిడి; అనఁగ; దారిద్ర్యమునకు = బీద[1]ఱికమునకు; ఆఖ్యలు.

తే. మగతనం బన గం డన ౼ మగఁటిమి యనఁ
బౌరుషంబున కాఖ్యలై ౼ పరఁగుచుండు
నుక్కు చేగ దిటము చేవ ౼ యుదుటు గట్టి
దిట్ట ముఱిది బిగువు నాఁగ ౼ ధృతికిఁ బేళ్లు **99**

మగతనము; గండు; మగఁటిమి, అనఁగా పౌరుషంబునకు = పురుషుని తనమునకు; ఆఖ్యలు ఉక్కు, చేగ, దిటము, చేవ; ఉదుటు; గట్టి; దిట్టము; ఉఱిది; బిగువు; నాఁగ = అనఁగా, ధృతికి = ధైర్యమునకు, పేళ్ళు.

తే. బద్దునా బొంకు నాఁగ ద ౼ బ్బర యనంగఁ
గల్ల నాఁగ హుళక్కిఁ నా ౼ జెల్లుఁ బేళ్లు
ధర నసత్యమునకుకు; స ౼ త్యంబు పరఁగు
నిజ మనఁగ నిక్కువం బన ౼ నిక్క మనఁగ **100**

బద్దు; బొంకు; దబ్బర; కల్ల; హుళక్కి; నాగ = అనినచో, అసత్యమునకు = అబద్ధమునకు; పేళ్ళు చెల్లును నిజము, నిక్కువము; నిక్కము అనఁగ; సత్యంబు; చెల్లును.

క. బెడఁద దెస చేటు చేడ్పా
టొడ వాంత్రం బంగలార్పు ౼ గోరంబు దొసం
గిడుమ వెత కస్తి యంగద
కడగం డ్లన జను విపత్తు ౼ (గౌరీ రమణా!)

---

1. చిన్నాదులకు ఱికవర్ణకంబగు.

బెడద, దెస, చేటు, చేడ్పాటు, గొడవ, ఆర్తము, అంగలార్పు, వెత (వ్యథ - ప్ర) గోరము (ఘోరము-ప్ర) దొసంగు, ఇడుము, కస్తి, అంగద, కడగండ్లు, అనఁగా, విపత్తు, ఆపద, తనరును.

క. వెల జట్టి విలువ రో యనఁ
గల నుడువులు దనరుచుండుఁ గ్రయనామములై
వెలయంగ వంగసము నా
గొలమన వంగడమునాఁగఁ గులమొప్పు (శివా!) 102

వెల, జట్టి, విలువ, రో, అనఁగల = అనునట్టి, నుడువులు = పలుకులు; క్రయనామములై = వెలకుఁ బేళ్లై; తనరును; వంగసము, కొలము; (కులము - ప్ర) వంగడము (వంశము - ప్ర) కులము పేళ్ళు.

క. క్రమ్మఱ నెప్పటి వెండియుఁ
గ్రమ్మఱి తిరుగన్ మఱి మఱల మగుడను నా
నిమ్మహిఁ బునఃపదంబున
కిమ్ముల నివి యాఖ్యలగు (మహీధర చాపా!) 103

మహీధరచాపా! = మేరువు విల్లుగాఁ గలవాఁడా! క్రమ్మఱ; ఎప్పటి, వెండియు, క్రమ్మఱి, తిరుగన్, మఱిన్, మరలన్, మగుడన్; నా = అనిన; పునఃపదంబునకు = మరల అనుపదమునకు; ఇవి ఆఖ్యలు.

క. ఒకమరి యొకపరి యొకమా
టొకసా రొక తేప యనఁగ నొకపా రనఁగా
నొకవిడుత యొక్కతూరన
నొకతడవయనంగ మఱియు నొకతూరియనన్ 104



తే. ఏకవారం బనుట కొప్పు నిన్ని పేళ్లు
జగతిఁ బల్మాఱు వేమాఱు సారె పెక్కు-
మాఱు లెన్నేని మార్లనఁ బరఁగు నాఖ్య
లగుచు నవి బహువారంబు లనుట (కీశ!) 105

ఒకమరి, ఒకపరి, ఒకమారు, ఒకసారి, ఒకతేప, ఒకపారి, ఒకవిడుత, ఒక్కతూరు, ఒక్కతడవ, ఒకతూరి; అనఁగా ఏకవారంబు = ఒకమారు; అనుటకు పేళ్ళు. పల్మాఱు; (పలు + మాఱు); వేమాఱు (వేయి + మాఱు). సారె; పెక్కుమాఱులు; ఎన్నేనిమార్లు; అనఁగా బహువారంబులకు = పెక్కుసార్లకు,ఆఖ్యలు.

తే. త్వరితమున కొప్పుఁ బేళ్లు చెచ్చెరను సరగ
వేగిరము వేగ వేళను వెసను వడిగ
గక్కునను గ్రద్దన ననంగ గ్రన్న ననఁగ
గొబ్బునను దిగ్గున ననంగ (గుధరచాప!) 106

చెచ్చెర (చెర + చెర) సరగ; వేగిరము; వేగ; వేగము; వెస; వడిగ; గక్కున; గ్రద్దన; గ్రన్నన, గొబ్బున, దిగ్గున, అనఁగ, త్వరితమునకు = తొందరపడుటకు; పేళ్ళు; ఒప్పును.

క. కలవు వివరింపఁగను నా
ఖ్యలు వరుసన్ నిర్గమించె ననుటకు ధరలో
వెలువడియె వెళ్ళె వెడలెను
వెలలె ననం (జిత్ప్రకాశ! విశ్వాధిపతీ!) 107

చిత్ ప్రకాశ! = జ్ఞానమే ప్రకాశముగాఁగలవాఁడా! విశ్వాధిపతీ! లోకమున కధిపతియైనవాఁడా! వెలువడియె; వెళ్లెను; వెడలెను; వెలలెను (లడ లకు భేదములేదనుట నీ రూపము) అనన్; నిర్గమించెను =

దాఁటిపోయెను; అనుటకు; ఆఖ్యలు = పేళ్లు; వరుసన్; కలవు = ఉన్నవి

క. వినుతియొనరించె ననుటకుఁ
దనరున్ నామంబులగుచు ధరపై నగ్గిం
చెను గై వారము సేసెన్
గొనియాడెను బొగడెననఁగఁ గొండాడెనన్ 108

అగ్గించెను; కైవారముచేసెను; కొనియాడెను; పొగడెను. కొండాడెను; అనఁగ; వినుతి యొనరించెను = పొగడెను; అనుటకు; నామంబులు కలవు.

సీ. చుట్టలు విందులు చుట్టాలు బందుగు
లనఁ జను బంధు సమాహ్వాయములు
వఱలు నన్యుఁడు లాఁతి వాఁ డనఁగా వింత
వాఁ డనఁగాఁ బెఱ వాఁ డనంగ
వ్యాజంబునకు నామ మౌ నెపం బనఁగ; న
న్వేషించె ననుట కౌ వెదకె నెమకె
నరసె రోసె ననంగ నారసెఁ దడవె నాఁ
గాంక్షకుఁ బేరు లౌ గ్రమముతోడఁ
తే. గ్రచ్చ కోరిక తమి కోర్కి యిచ్చ యనఁగ
నెపుడు నెడపక యుడుగక యెల్లపు డన
నిచ్చయనయంబు నాఁగను నిచ్చ లనఁగఁ
వనగు నాఖ్యలు సంతతం బనుట (కీశ!) 109

చుట్టలు, విందులు, చుట్టాలు;[1] బందుగుల పేర్లు; చనున్

1. చుట్టము + లు = లు ల న, లు పరంబులగునపుడు ముపర్ణమునకు లోపము తత్పూర్వ స్వరంబునకు దీర్ఘము విభాషనగును.



ఒప్పును. అన్యుఁడు = ఇతరుఁడు, లాఁతివాఁడు, వింతవాఁడు, పెఱవాఁడు, అనఁగా వరలును, వ్యాజమునకు = మిషకు, నెపము, అనునది నామము. అన్వేషించెను = వెదకెను, అనుటకు, వెదకెను_నెమకెను. అరసెను, రోసెను, అరసెను, తడవెను, నా = అనఁగా, నామములు, అగును. క్రచ్చ, కోరిక, తమి, కోర్కి, ఇచ్చ (ఇచ్ఛ – ప్ర) అనఁగ, కాంక్షకున్ = అపేక్షకు పేరులు. ఎపుడు, ఎల్లపుడు, ఎడపక, ఉడుగక, నిచ్చ (లు) అనయము. నాఁగన్ = అనినచో, సంతతంబు = ఎల్లప్పుడును అనుటకు నామములు.

సీ. తనరుఁ బ్రవేశించె ననుటకు నాఖ్యలు
తూఁకొనెఁ జొచ్చెను దూఱె ననఁగ
నంఘ్రితాడితుఁ జేసె ననుటకుఁ బేళ్ళగుఁ
దాఁచెఁ గాళ్ళఁ గ్రుమ్మెఁ దన్నె ననఁగ
నాలస్య మొనరించె ననుటకుఁ జెల్లు నా
మమ్ములు తడసెను మసలె ననఁగ
త్యక్తంబు గావించె ననుటకుఁ నాఖ్యలౌ
వీడెను వదలెను విడిచె ననఁగ
తే. దాఁటుమాఱయ్యె వీడ్వడెఁ దడఁబడె నన
నాఖ్య లొప్పు విపర్యస్త మయ్యె ననుట
కలరుఁ బ్రహరించె ననుట కౌ హ్వాయములడిచెఁ
గొట్టె మొత్తెను మోఁదెనాఁ (గుధరనిలయ!) 110

తూఁకొనెను, చొచ్చెను, దూఱెను, అనఁగా, ప్రవేశితుఁడయ్యెను = లోనఁ జొచ్చెననుటకు, ఆఖ్యలు. తాఁచెను, కాళ్లఁ గ్రుమ్మెను, తన్నెను, అనఁగను అంఘ్రితాడితుఁ జేసెననుటకు = కాలఁ గొట్టెననుటకుఁ బేళ్ళు. తడసెను, (తడియుధాతువు) మసలెను,

అనఁగా, ఆలస్యము చేసెననుటకు, ఆఖ్యలు. వీడెను, వదలెను, విడిచెను, అనఁగ, త్యక్తంబుగావించెను = వదలిపెట్టెను, అనుటకు ఆఖ్యలు. తారుమారైనది, వీడ్వడినది, తడఁబడినది. అనఁగ, విపర్యస్తమయ్యెను = తారుమారైనది, అనుటకు పేళ్ళు;
అడిచెను, కొట్టెను, మొత్తెను, మోఁదెను, అనఁగ ప్రహరించెను = కొట్టెను, అనుటకు, ఆహ్వాయములు = పేళ్ళు,

సీ. ముందట నెదుటను ॥ మ్రోల ముంగల నాఁగ
నాఖ్యలౌ సముఖమం ॥ దనుట (కభవ!)
యలయిక బడలిక ॥ యలపు సేద యనంగ
క్రమమున కాఖ్యలౌ ॥ (శమనదమన!)
తాలిమి యోరుపు ॥ తాలిక నాఁగను
క్షమకు నాహ్వాయము లౌఁ ॥ (చర్మవసన!)
తవళి బవంతంబు ॥ టక్కు దుత్తూరంబు
వెడ్డు నా ఛద్మ మౌ ॥ (విషమనేత్ర!)
తే. వెఱ పనఁగ వెద యనఁగను ॥ వెఱ యనంగ
నళుకు కనఁగ భీతి కాఖ్యలౌ ॥ (నసితకంఠ!)
నిమ్మళం బన నెమ్మినా ॥ నెమ్మది యనఁ
దనరుఁ బేళ్ళు నిరాతంక ॥ మునకు (నీశ!) 111

సముఖమందు = ఎట్ట ఎదుట, అనుటకు, ముందట, ఎదుట, ముంగల, మ్రోల, అనఁగా, పేళ్ళు అగును. శ్రమమునకు = బడలికకు అలయిక, బడలిక అలపు, సేద, అనఁగ ఆఖ్యలు, అగును.

క్షమకు = సహనమునకు, తాలిమి, ఓర్పు తాలిక, అనఁగా. పేళ్లు అవును. (చర్మవసన = గజ చర్మము వస్త్రముగాఁగల వాఁడా!) తవళి, పవంతము, టక్కు, దుత్తూరము; వెడ్డు అనఁగా



ఛద్మము = మోసము, అగును వెఱపు, వెఱ, ఎద, అళుకు, అనఁగా, భీతికి భయమునకు, ఆఖ్యలు. నిమ్మళము, నెమ్మి, నెమ్మది. (నెఱ + మది) అన, నిరాతంకమునకు = భయములేనితనమునకు పేళ్ళు.

సీ. అసదు కొంచెము సైక ॥ మలఁతి యన్నువ చిన్న
నలికంబు సన్నంబు ॥ నాఁ దనర్చు
స్వల్ప మెక్కుడు నాఁగఁ ॥ జాల నెంతేనియు
మిగులఁ దద్దయుఁదద్ద ॥ మిక్కిలి యనఁ
బెద్దయు నను నివి ॥ పేళ్ళగు భృశముగా
ననుటకు నుత్కట ॥ మయ్యె ననుట
కగుఁ బేళ్లు వెగ్గలం ॥ బయ్యెఁ గ్రిక్కిఱిసె వె
క్కస మయ్యె నను నివి ॥ క్రమముతోడ
ఆ. సగ్గఁ గుండె డొంకెఁ ॥ దగ్గను సడలెను
గ్రుంగె నుబ్బణంగె ॥ గ్రుక్కెననఁగఁ
దనరుఁ బేళ్ళు క్షీణ ॥ దశ నొందె ననుటకు
(నీశ్వరీసనాథ! ॥ విశ్వనాథ!) 112

స్వల్పము = కొలఁది, అసదు, కొంచెము, సైకము, అలఁతి, అన్నువ, చిన్న, నలికము, సన్నము, అనఁగా ఒప్పును. ఎక్కుడు, చాల, ఎంతేని, మిగుల, తద్దయు, తద్ద, మిక్కిలి, పెద్ద, అనునివి, భృశంబునకు = ఎక్కువందనమునకు పేళ్ళు. వెగ్గలమయ్యెను, క్రిక్కిఱిసెను, వెక్కసమయ్యెను, అనునివి, క్రమముతో ఉత్కటమయ్యెను = మితిమీఱెను, అనుటకుఁ బేళ్ళు. సగ్గెను, కుందెను, డొంకెను, తగ్గెను, సడలెను, గ్రుంగెను. ఉబ్బణఁగెను, గ్రుక్కెను, అనఁగ, క్షీణదశకు = తగ్గిపోవుటకు, పేళ్ళు.

ఆ. మించు వాసి మేలు ƒ మేటి పెచ్చెచ్చన
నధికమునకు నాఖ్య ƒ లగుచు వెలయుఁ
బనులు నాఁగఁ జెయువు ƒ లనఁ జేఁత లన నొప్పుఁ
గర్మమునకుఁ బేళ్ళు ƒ (చర్మవసన!) **113**

మించు. వాసి, మేటి, పెచ్చు, ఎచ్చు, అనఁగా అధికమునకుఁ బేళ్ళు. పనులు, చెయువులు, చేఁతలు, అనఁగా, కర్మమునకు = పనికి, నామములు ఒప్పును.

ఆ. అనిపె నని చెఁ బనిపెఁ ƒ బనిచె నంపెను బంపె.
బుచ్చె గెలువుమనియెఁ ƒ బొమ్మనియె
ననఁగ నివి సమాఖ్య ƒ లగును ప్రస్థాపించె
ననెడు క్రియకు (నీశ! ƒ యభ్రకేశ!) **114**

అనిపెను, అనిచెను, పనిచెను, పనిపెను, అంపెను, పంపెను, పుచ్చెను, గెలువుమనెను, పొమ్మనెను అనఁగా, ఇవి ప్రస్థాపించెనను కర్మకు = పంపెను అనుపనికి, సమాఖ్యలు = పేళ్ళు. (ఇందుఁ బ్రేరణము గ్రాహ్యము.)

తే. కొదవ కొఁద కుందు తగ్గు త ƒ క్కువ కొఱంత
వెలితి కొఱ లొచ్చు కడమనా ƒ వెలయు న్యూన
సమభిధానము లర సాము ƒ సగము సవము
నాఁగ నర్ధాహ్వయంబు లౌ ƒ (నాగభూష!) **115**

కొదవ, కొద, కుందు, తగ్గు, తక్కువ, కొఱంత వెలితి, కొఱ, లొచ్చు, కడమ, అనఁగా, న్యూనసమభిధానములు = లోటునకుఁ బేళ్ళు. వెలయును. అర, సాము, సగము, సవము, అనఁగా అర్ధాహ్వయములు = సగమునకుఁ బేళ్ళు అగును.



తే. పేళ్ళు పశ్చాత్తనుటకును ƒ జెల్లు వెనుకఁ
బిదపఁ దర్వాతఁ బదపడి ƒ పిమ్మట నన
మునుపు మునుమున్ను తొలితొల్లి ƒ ముందుతొలుత
ననఁగఁ బూర్వపదార్థాఖ్య ƒ లౌ (గిరీశ!) **116**

వెనుక, పిదప, తర్వాత, పదపడి, పిమ్మట అనఁగా, పశ్చాత్తు — ఆ పిదప, అనుటకు, పేళ్లు. మునుపు, మును, మున్ను. తొలి తొల్లి, ముందు, తొలుత, అనఁగా, పూర్వపదాఖ్యలు — జరిగిపోయినది అను పదమునకుఁ బేళ్లు,

ఆ. పాఱుఁబోతు పిఱికి ƒ పంద కోఁచ యనంగఁ
బేళ్లు దనరు సమర ƒ భీరువునకు
దిట్ట యుక్కుతునియ ƒ గట్టిడెందంబువాఁ
డనఁగ ధైర్యవంతుఁ ƒ డలరు (నీశ!) **117**

పిఱికి, పంద (పిఱికిపంద) కోఁచ, అనఁగా సమర భీరువునకు = యుద్ధమున వెన్నిచ్చువానికిఁ బేళ్లు.
దిట్ట, ఉక్కుతునియ = ఉక్కుతుంట వంటివాఁడు. గట్టి డెందంబు వాఁడు = గుండె దిటవుగలవాఁడు. అనఁగా, ధైర్యవంతుఁడు = ధైర్యము గలవాఁడు అగును.

తే. పౌఁజు చేరువ మొత్తంబు ƒ బారు తుటము
దండు పరి గమి కూటువ ƒ పిండు దాఁటు
మూఁక దళమనఁ బేళ్ళు స ƒ మూహమునకు
(భుజగ వరహార! యవిముక్త ƒ పురవిహార!) **118**

భుజగ వరహార = శ్రేష్ఠమైన సర్పములు హారముగాఁ గలవాఁడా! అవిముక్తపుర = మోక్షము నిచ్చుపురమున, విహారా! = విహరించువాఁడా! పౌఁజు, చేరువ, మొత్తము, బారు, తుటము, దండు, పరి, గమి, కూటువ,

పిండు, దాటు, మూఁక, దళము, సమూహమునవర్గ = గుంపునకు పేళ్ళు.

సీ. పూనె నూనెను దాల్చెఁ ƒ నానెను మోచె నా
వహియించె ననుట కౌఁ ƒ (నహివిభూష!)
నామము లుచ్చాట ƒ నము చేసెననుటకు
వరుసతోఁ దరిమెను ƒ బఱపె వెలిచెఁ
దోలెను అొప్పెనా ƒ (ద్రుహిణాదిసురనుత!)
త్రిప్పెను నాఁ గ్రమ్మ ƒ ఱించె ననఁగ
మగిడించె ననఁగను ƒ మఱలించె నన సమా
హ్వాయములై పఱఁగు ని ƒ వర్తితంబు

తే. చేసె ననుటకు (సురముని ƒ సిద్ధసేవ్య!)
యడ్డగించెను నా నిల్పె ƒ ననఁగ నాఁగె
నన నివారించె ననుటకు ƒ నాఖ్యలమరు
(నగసుతానాథ! గుహ గజా ƒ నన సనాథ!) 11

నగసుతానాథ! = పార్వతీపతీ! గుహ = కుమారస్వామిని, గజా = వినాయకుని, సనాథ = బలవంతులుగాఁ జేయువాఁడా! పూనె నూనెను, తాల్చెను, ఆనెను, మోచెను. అనఁగా, వహించెను = తలఁదాల్చె అనుటకు పేళ్లు. తఱిమెను, పఱపెను, వెలిచె తోలెను, అొప్పెను, అనఁగా, ఉచ్చాటనముచేసెను = తఱిమివైచె అనుటకు పేర్లు. త్రిప్పెను, క్రమ్మఱించెను, మగిచెను, మరలించెను, అనఁగా నివర్తితంబుచేసెను = పోవువాని నిలిపె అనుటకు పేళ్లు. అడ్డగించెను, నిల్పెను, ఆగెను, అనఁ నివారించెను = అడ్డుపెట్టెను, అనుటకు పేళ్ళు.



తే. దండ చేరువ సంగడి ƒ దాపు చెంత
సరస చెంగట యొద్ద డ ƒ గ్గఱ కురంగ
టంగ పజ్జయు నా సమీ ƒ పాఖ్య లమరు
(రమ్యధవళాంగ! కలశనీ ƒ రధివిషంగ!) 120

రమ్యధవళాంగ = మనోహరమైన తెల్లని గుర్తుగలవాఁడా! కలశనీరధి = పాలసముద్రము, విషంగ = తూణీరముగాఁగలవాఁడా, దండ, చేరువ, సంగడి, దాపు, చెంత, సరస, చెంగట, ఒద్ద, దగ్గఱ, కురంగట, అంగ, పజ్జ, అనఁగా సమీప + ఆఖ్యలు = దగ్గఱితనమునకు పేర్లు, అమరును.

తే. అచట నచ్చట నచ్చోట ƒ నందు నాడ
నచొట నచ్చోట నక్కడ ƒ నయ్యెడ నట
ననఁగఁ దత్ప్రదేశంబునం ƒ దనుట కాఖ్య
లయ్యె (భక్తవిధేయ! యా ƒ ర్యాసహాయ!) 121

భక్తవిధేయ! = భక్తులకు విధేయుఁడైనవాఁడా! ఆర్యాసహాయ! = పార్వతీదేవి సహాయముగలవాఁడా! అచట, అచ్చట, అచ్చోట, అందు, అడ, అచ్చొట, అచ్చోట, అక్కడ, అయ్యెడ, అట, అనఁగా తత్ప్రదేశంబునందు = ఆ ప్రదేశమున అనుటకు పేళ్ళు.

క. ఇరుఁగెలఁకుల నిరువంకల
నిరుదెస నిరుచక్కియందు ƒ నిరుపక్కియలం
దిరుగ్రేవల నిరుగడ నన
బొరిఁ బేళ్లగు నుభయపార్శ్వ ƒ ములనుట (కజా!)

అజా! = పుట్టుక లేనివాఁడా! ఇరుగెలఁకుల, ఇరువంకల, ఇరుదెసలు, ఇరుచక్కియల, ఇరుపక్కియల. ఇరుగ్రేవల, ఇరుగడల,

అనఁగా ఉభయపార్శ్వముల = రెండు ప్రక్కలందు, అనుటకు పేళ్ళు.

క. నవముగ ధరలో నీ మా
నవవర్గువు వేడ్కఁ జదివి నను వ్రాసిన మా
నవులకు ననవరతంబును
శివుఁడవిము క్తేశ్వరుండు చెలువం బొసఁగున్ 123

తా॥ శ్రోత్రిఁగ భావించి యీ మానవవర్గును చదివిన, వ్రాసిన మానవులకు మోక్ష సామ్రాజ్యాధిపతియైన శంకరుఁడు నిరంతర సంపదల నొసంగును.

---

## స్థావరవర్గు

సీ. వలిదిబ్బ వడఁకుగు బ్బలి చలిమిరిమల
గట్టులఱేఁడు ము క్కంటిమామ
మంచుఁగొండన హిమ క్ష్మాధరాఖ్యలు చను
వేలుపుఁగొండ జే జేలగట్టు
పుత్తడి గుబ్బలి పునుకకంచమువాని
విల్లు నా మేరువు పేళ్లు వెలయు
వెలిదిబ్బ ముక్కంటి మల వెండికొండ నాఁ
గైలాస పర్వతా ఖ్యలు సెలంగు
తే. వెలయుఁ దరిగొండ కవ్వంపు మలయనంగ
మందరాఖ్యలు; కడపటి మల యనంగఁ



జుట్టుఁగొండనఁ దనరు నీ క్షోణియందుఁ
జక్రవాళాద్రి (వృషవాహ! శైలగేహ!) 124

వలిదిబ్బ = చలిగల కొండ, వడఁకుగుబ్బలి = వణఁకు గలిగించు కొండ, చలిమిరిమల = చల్లఁదనముగల కొండ, గట్టులఱేఁడు = కొండలకు రాజు, ముక్కంటిమామ = (పార్వతి నిచ్చుటచే) శివునకు మామయైన కొండ, మంచుకొండ = మంచుగల పర్వతము. అన, హిమక్ష్మాధర + ఆఖ్యలు = హిమవత్పర్వతమునకుఁ పేర్లు. వేలుపుఁ గొండ = దేవతలుండు గిరి. జేజేలగట్టు = దేవతలదైన పర్వతము, పుత్తడి గుబ్బలి = బంగారుకొండ, పునుకకంచమువానివిల్లు = కపాలము ధరించిన శివుని విల్లు = (త్రిపురసంహారమున మేరువు విల్లుగా ధరించెనని పౌరాణిక కథ) నాఁ = అనిన, మేరువు, పేళ్ళు వెలయు. (ప్రథమ ప్రసక్తి హిమవంతమునకిచ్చు టిందు గ్రాహ్యము) వెలిదిబ్బ = తెల్లని కొండ ముక్కంటిమల = శివుని పర్వతము, వెండికొండ = వెండివంటి కాంతి గల, గిరి, నాఁ = అనిన, కైలాసపర్వతాఖ్యలు = కైలాసము పేర్లు, తరికొండ = చిలుకుట కుపయోగించిన కొండ, కవ్వపు కొండ (దేవదానవులు దీనితో పాలసముద్రమును జిలికి వాంఛితములఁ బొందిరి) అనంగ, మందరాఖ్యలు = మందర పర్వతము పేర్లు.

కడపటిమల = ఆఖరుకొండ, చుట్టుకొండ = భూమికిచుట్టు నుండెడి పర్వతములు అని, చక్రవాళమునకు, పేర్లు. అమరసింహుఁడు చక్రవాళం తు మండలం' అని కనుచూపుమేరగా దీనిని చెప్పెను, కాని పర్వతమనలేదు, లోకము ఆలోకమునకు నడుమనుండునది కాన లోకాలోక పర్వతమని మునవారి తలంపు.

ఆ. తూర్పుఁగొండ నాఁగఁ దొలుగట్టు నాఁగను
బొడుపు గుబ్బ లనఁగఁ బూర్వశిఖరి

పరఁగుఁ గ్రుంకుమెట్టు ꟹ పడమటి కొండ నా
వెలయు నస్తశిఖరి ꟹ (విశ్వనాథ!) 125

తూర్పుఁకొండ = తూర్పు పర్వతము, తొలఁగట్టు = మొదట చెప్ప బడుకొండ, పొడుపుగుబ్బలి–సూర్యోదయమగు కొండ. అనఁగా. పూర్వ శిఖరి = తూర్పునందలి పర్వతము.
క్రుంకుమెట్టు – సూర్యుఁడస్తమించు కొండ, పడమటి కొండ, నాఁ = అనఁగా, అస్తశిఖరి = పడమటనుండు కొండ, వెలయును.

తే. ఒప్పుగిరిపేళ్ళు మల గట్టు ꟹ తిప్ప మెట్టు
కొండ గుబ్బలి నా మేరు ꟹ (కుధరచాప!)
తాయి నాఁ గల్లనంగను ꟹ తా యనంగ
శిల కభిఖ్యలు దగు నిల ꟹ (శేషభూష!) 126

మల, గట్టు, తిప్ప, మెట్టు, కొండ, గుబ్బలి, నాఁ = అనిన, గిరి పేర్లు = కొండకు పేర్లు. తాయి, కల్లు, తా, యనఁగను, శిలకభిఖ్యలు = రాతికి పేర్లు.

తే. పల్లె కొట్టిక కోటిక కు ꟹ ప్పమ్ము నాఁగ
నూరనఁగ గ్రామనామంబు ꟹ లొప్పుచుండు
పట్టణంబున కాఖ్యలు ꟹ పరఁగుచుండుఁ
బ్రోలనఁగ వీడనంగను ꟹ (శూలపాణి!) 127

పల్లె, కొట్టిక, కోటిక, కుప్పము, ఊరు, అనఁగా గ్రామమునకుఁ బేళ్ళు, ప్రోలు, వీడు, అనఁగను, పట్టణమునకు, ఆఖ్యలు = పేళ్ళు, పరఁగుచుండును.

ఆ. ఉనికిపట్టు తావు ꟹ మనికిపట్టిర విల్లు
తెంకి యిక్క–వట్టు ꟹ టెంకి యిమ్ము



నెలవు గీము నాఁగ ꟹ నలరు నివాస దే
శంబుపకును పేళ్ళు ꟹ (చంద్రమౌళి!)

ఉనికిపట్టు, తావు, మనికిపట్టు, ఇరవు, ఇల్లు, తెంకి, యిక్కవట్టు' టెంకి, ఇమ్ము, నెలవు, గీము (గృహము–ప్ర) నాఁగ = అనిన, నివాస దేశమునకును = ఉండుచోటునకుఁ బేళ్ళు.

సీ. తెంకాయచెట్టనఁ ꟹ టెంకాయ మ్రానన
నారికేళం బొప్పు ꟹ (నగనివేశ!)
మావిమ్రా ననఁగను ꟹ మామిడిచెట్టన
నామ్రభూజం బొప్పు ꟹ (నభ్రకేశ!)
అత్తిమ్రానన మేడి ꟹ యనఁగ నౌదుంబర
ధారుణీజం బొప్పు ꟹ (మేరుచాప!)
యరఁటి యనఁటి నాఁగ ꟹ నంశుమత్ఫలధారు
ణీరుహం బగు (ధర ꟹ ణీశతాంగ!)

తే. యలరుఁ దుంబీశలాటు న ꟹ మాఖ్య లాను
గంబు సొరకాయ వదరు దా ꟹ (గరళకంఠ)
తా డనంగను దాడి నా ꟹ తాళభూరు
హంబునకు నాఖ్యలై యొప్పు ꟹ (నంబికేశ!) 129

నారికేళము, తెంకాయమ్రాను, టెంకాయచెట్టు అనఁగా నొప్పును, ఆమ్రభూజము = మావిమ్రాను, మామిడి చెట్టు అనఁగా నొప్పును. ఔదుంబర ధారుణీజము = మేడిచెట్టు, అత్తిమ్రాను, మేడి యనఁగా నొప్పును.
అంశుమత్ఫలధారుణీజము = కదళీ వృక్షము, అరటి, అనంటి, అనఁగా నొప్పును. తుంబీశలాటు = ఆనబచెట్టు, అను

గము, సాలకాయ, వదరు అనఁగా నొప్పుచుండును. తాళభూరుహము = తాళవృక్షము, తాడు, తాడి యను నామములుగలది.

సీ. మొక్క మోక నిసువు మొలక మోసనఁగ నం
కురమునకును బేళ్ళు (కుధరచాప!)
ఇగు రనఁ దలిరు నా జిగురు నాఁ జివురనఁ
బల్లవనామముల్ పరఁగు (నీశ!)
మ్రానన జెట్టన మ్రాఁకన భూరుహ
నామధేయము లగు (వామదేవ!)
పువు పువ్వు పూ నాఁగఁ బుష్పము విరి యల
రనఁ గుసుమాఖ్యలై యలరు (నీశ!)

తే. గుబురు దట్టము జొంపంబు గుంపు తఱచు
నాఁగ నిబిడంబు పేళ్ళొప్పు (నందివాహ!)
వల్లరిసమాఖ్య లగుచు వ ర్తిల్లుఁ దీఁగ
తీవ తీవియ తీవె నాఁ (త్రిపురవైరి!) 130

మొక్క, మోక, నిసువు, మొలక, మోసు, అనఁగ, అంకురమునకు పేర్లు — ఇగురు, తలిరు, చిగురు, అనఁగా, పల్లవమునకు = లేఁతాకునకు, నామములు. మ్రాను, చెట్టు, మ్రాఁకు, అనఁగా, భూరుహమునకు = వృక్షమునకు, నామములు. పువు, పువ్వు, పూ, పుష్పము (పుష్పము — ప్ర) విరి, అలరు, అనఁగా, కుసుమాఖ్యలు = పుష్పనామములు. గుబురు, దట్టము, జొంపము, గుంపు, తఱచు, అనఁగా, నిబిడంబు = దట్టముగాఁ బెఱుగుటకు పేళ్ళు, అగును. తీఁగ, తీవ, తీవియ, తీవె, అనఁగా వల్లరీసమాఖ్యలు = లతకు నామములు.



ఆ. అగ్రమున కభిఖ్య లగుచుండుఁ దుద సుద
కొనయనంగ వృక్ష కోటరమున
కలరుఁ బేళ్ళు తొఱ్ఱ తొలి తొఱ్ఱ తొఱ నాఁగ
(నాగహార! రజత నగవిహార!) 131

తుద, సుద, కొన, అనునవి అగ్రమునకు = చివర భాగమునకు నామములు. తొఱ్ఱ, తొఱ్ఱ, తొలి, తొఱ, అనఁగ, వృక్షకోటరమునకు = చెట్టులోని బొఱియకు, నామములు.

ఆ. ఇక్షువున కభిఖ్య లీక్షితిఁ గన్నుల
మ్రాను చెఱకు తియ్య మ్రాననంగఁ
దనరు దవ యనంగఁ దలవాడె నాఁగఁ ద
దగ్రమున కభిఖ్య లగు (గిరీశ!) 132

కన్నులమ్రాను = కణుపులుగలది, చెఱకు, తియ్యమ్రాను = తీయఁదనము గలది, అనఁగా. ఇక్షువునకు = చెఱకుగడకు, అభిఖ్యలు = పేర్లు. (మ్రానను ట ప్రయోగవిశేషము) తదగ్రమునకు = ఆ చెఱకుగడ కొనకు, దవ, తలవాఁడె, అని పేర్లు.

క. అగుఁ బేళ్ళుత్పలమునకుం
దొగ తొవ కల్వ కలు వనఁగ దోయజ మొప్పం
దగుఁ దమ్మి తామ రనఁగా
మొగడన మొగ్గయనఁ దనరు ముకుళంబు (శివా!)

తొగ, తొవ, కల్వ, కలువ, అనునవి, ఉత్పలమునకు = తెల్లకలువకు పేర్లు. తమ్మి, తామర, అనఁగా, తోయజము = కమలము, ఒప్పును. మొగడ, మొగ్గ, అనఁగా, ముకుళంబు = మొగ్గకు పేర్లు.

తే. ఎఱఁగు జెందొవ చెందొగ | యెఱ్ఱగలువ
యనఁగ రక్తోత్పలంబు ర | క్తాబ్జ మొప్పు
నిలను గెందమ్మి కెందామ | రెఱ్ఱదామ
రనఁగఁ జెందమ్మి చెందామరస (మహేశ!) **134**

చెందొవ (చెన్ను + తొవ[1]) అందమైన కలువ, చెందొగ (చెన్ను + తొగ) ఎఱ్ఱకలువ అనఁగ, రక్త + ఉత్పలము = ఎఱ్ఱని కలువ. ఒప్పును. కెందమ్మి (కెంపు + తమ్మి[1]) కెందామర (కెంపు + తామర) ఎఱ్ఱతామర, చెందమ్మి (చెన్ను + తమ్మి) = చెందామర అనఁగా, ఎఱ్ఱని కమలమగును.

క. గొడుగు గొడు వెల్లి యనఁజె
న్నడరును ఛత్రంబు కేత | నాహ్వాయము లగున్
సిడె మనఁగఁ డెక్కె మనఁగాఁ
బడగ యనన్ డా లనంగఁ | (బర్వతధన్వీ!) **135**

గొడుగు. గొడువు, ఎల్లి, అనఁగా, ఛత్రంబు, చెన్నడరును = సొంపారును; సిడెము, టెక్కెము, పడగ, డాలు, అనఁగా, కేతనాహ్వాయములు = జండాకుఁ బేళ్లు.

క. మఱుఁగనఁగ నోల మనఁగాఁ
మఱు వనఁగాఁ జాటనంగ | మాటన వరుసం
బరఁగు నివెల్ల నగోచర
ధరణీ నామంబు లగుచు | (దర్పకదమనా!) **136**

దర్పకదమనా! = మన్మథుని హరించినవాఁడా! మఱుగు, ఓలము, మఱువు, చాటు, మాటు, అనఁగా, ఇవన్నియు, అగోచర ధరణీనామంబులు = కనుపడని చోట్లకుఁ బేళ్ళు.

1. ప్రాతాదులు లుప్తశేషమునకు ద్రుతకార్యము.



క. పొసఁగుఁ దృణాఖ్యలు పులు నాఁ
గస వనఁగా బూరి యనఁగ | గడ్డి యనంగా
వసుమతిలో నెన్నంబడు
ససి సస్సెము పైరనంగ | సస్యం (బభవా!) **137**

పులు, కసవు, పూరి, గడ్డి, అనఁగా, వసుమతిలో = ధరణియందు తృణాఖ్యలు = గడ్డికి పేర్లు. సస్యంబు = పైరు, ససి, సస్సెము. (సస్యము - (ప్ర) పైరు, అని, ఎన్నఁబడును.

ఆ. తెలుపు దెల్ల వెల్ల | తెలి వెలి నాఁగ నా
హ్వాయము లమరు ధవళ | వర్ణమునకుఁ
గప్పు నలుపు నల్ల కఱ | యన నాఖ్యలౌ
నీలవర్ణమునకు | (నీలకంఠ!) **138**

తెలుపు, తెల్ల, వెల్ల, తెలి, వెలి, నాఁగన్ = అనఁగా, ధవళమునకున్ = తెలుపునకు, ఆహ్వాయములు = నామములు, కప్పు, నలుపు, నల్ల, కఱ, అనఁగా, నీలవర్ణమునకు = నలుపునకు, ఆఖ్యలు = పేర్లు, అగును.

ఆ. కెంపు దొగరు దొవరుఁ | గెంజాయ యెఱు పెఱ్ఱ
యనఁగ నరుణకాంతి | కాఖ్య లయ్యె
నళిది పసుపుచాయ యనఁగ | హారిద్రవ
ర్ణమున కాఖ్య లగుఁ (బి | నాకహస్త!) **139**

పినాకహస్త = పినాకము (విల్లు) చేత ధరించినవాఁడా, కెంపు, తొగరు, తొవరు, కెంజాయ, (కెంపు + చాయ) ఎఱుపు, ఎఱ్ఱ, అనఁగా, అరుణకాంతి ఎఱ్ఱనిరంగు పేళ్ళు. అళిది, (అరిదళవర్ణము) పసుపుచాయ (ఛాయకు వికృతి చాయ) అనఁగ హారిద్రవర్ణమునకు = పసుపుపచ్చరంగునకు పేళ్ళు.

ఆ. శ్యామవర్ణమునకు ƒ నామంబు లగుచుండుఁ
బసరుచాయ యనఁగఁ ƒ బచ్చ యనఁగ
వన్నె డాలు రంగు ƒ వన్నియ జిగి జోతి
చాయ యనఁగఁ బరఁగ ƒ జగతిఁ గాంతి **140**

పసరుచాయ, పచ్చ అనఁగా, శ్యామవర్ణమునకు = ఆకుపచ్చరంగునకు నామములు. (ఇవి ప్రధానములు, మిగిలినవి వీనిలో నొకటితో నొకటి కలుపుటవలన వచ్చును) వన్నె (వర్ణము - ప్ర.) డాలు, రంగు, వన్నియ, జిగి, జోతి, చాయ అనఁగా, కాంతి పరగును. సాధారణముగా, వర్ణమునకుఁ బర్యాయములు,

తే. మానికము లన రతనముల్ ƒ నా నెసంగు
నవని మాణిక్యములకు స ƒ మాహ్వయములు
మెఱుఁ గనం గను నిగ్గు నా ƒ మెఱయుచుండు
నాఖ్య లుత్కృష్ట కాంతికి ƒ (నభ్ర కేశ!) **141**

మానికములు (మాణిక్యము - ప్ర.) రతనములు (రత్నము - ప్ర) అనునివి మాణిక్యములకుఁ బేళ్ళు. ఉత్కృష్టకాంతికిన్ = శ్రేష్ఠమైన కాంతికి, మెఱుఁగు, నిగ్గు అనునవి పేళ్ళు,

తే. జడధిపేళ్ళగు మున్నీరు ƒ కడలి సంద్ర
మనఁగ మడుఁ గన మడువు నాహ్రదము దనరుఁ
బరఁగు నావసంద్రంబు ƒ పాలవెల్లి
జిడ్డుకడలి పాల్కడలి నా ƒ క్షీరజలధి **142**

మున్నీరు (ముందు + నీరు) భూభాగము సృష్టిగాకముందు నీరుండినదని ప్రసిద్ధి - కడలి, సంద్రము (సముద్రము - ప్ర) అనఁగా, జడధి = సముద్రమునకుఁ బేళ్ళు. మడువు, అనునది, హ్రదము



నకు = తనంత నేర్పడిన నీటిగుంతకు పేరు ఆలవ సంద్రము, (సముద్రములు. ఏడు; లవణ; ఇక్షు, సురా, సర్పి, దధి, క్షీర, జల సముద్రములు) పాలవెల్లి = పాల సముద్రము, జిడ్డుకడలి = జిడ్డుగల యుదధి, నా = అనిన, క్షీర సముద్రమగును.

క. నంజె యన మడి యనంగను
మంజుల కేదారభూస ƒ మాఖ్యలు వెలయుం
బుంజె యనఁ జేను పొల మనఁ
గంజన మరుభూమి పేళ్ళు ƒ (కాయజదమనా!) **143**

మంజుల = మనోహరమైన, కేదార భూసమాఖ్యలు = వరి పొలముల పేర్లు, నంజ, మడి, అనునవి పుంజె, చేను, పొలము, కంజ, అనఁగా, మరుభూమి = నీటి పసలేని భూమి పేరు.

క. ధరణిన్ వివరాఖ్య లగున్
బొఱియ కలుఁగు లాఁగ బొక్కబొంద యనంగా
దరి యొడ్డు గట్టనంగా
బరఁగుం దీరంబు పేళ్ళు ƒ (ప్రమథగణేశా!) **144**

ప్రథమ గణేశా! = ప్రమథుల గుంపునకు నాయకుఁడా! బొఱియ, కలుఁగు, లాఁగ, బొక్క, బొంద అనఁగా, వివర + ఆఖ్యలు = బొక్కకుఁ బేళ్ళు తీరంబు పేళ్ళు = నదీతీరనామము, దరి, ఒడ్డు, గట్టు, అనునవి,

తే. అస లనంగను ఱొంపి నా ƒ నడుసనంగ
బుఱద నా నొప్పుఁ గర్దమం ƒ బునకుఁ బేళ్లు

భూమికి సమాఖ్యలగు బువి । పుడమి నేల
మన్ను పంటవలంతి నా । (మదనదమన!) **145**

అసలు, జొంపి, అడుసు, బుఱద, అనంగను, కర్దమంబునకు = అడుసునకు పేర్లు, ఒప్పును. బువి (భువి – ప్రకృ) పుడమి (పృథివి – ప్ర) నేల, మన్ను, పంటవలంతి = పంటల నొసంగునది. అనఁగా భూమికి పేళ్లు,

తే. జగిలె యనఁగ నరుఁగు నాఁగఁ । జగతినాఁగఁ
దిన్నె యన వేదికాఖ్యలై । యెన్నఁ దనరు
మిఱునంగను మెరక నా । మిట్టయనఁగ
నున్నతక్షితి కాఖ్యలై । యొప్పు (నభవ!) **146**

జగిలె, అరుఁగు, జగతి, తిన్నె, అనఁగా, వేదికాఖ్యలై = అరుఁగునకుఁ బేళ్లై, ఒప్పును. మిఱ్ఱు, మెరక, మిట్ట, అనఁగా, ఉన్నతక్షితికి = ఎత్తైన నేలకు, ఆఖ్యలు = పేర్లు.

తే. తనరు నిశ్రేణి తాప ని । చ్చెన యనంగఁ
దెప్ప తే పనునాఖ్యల । నొప్పుఁ బ్లవము
పరఁగు నోడనఁ గల మన । దరణి ధరణి
దరణి శీతాంశుశిఖనేత్ర! । (ధవళగాత్ర!) **147**

తరణి, శీతాంశు, శిఖి నేత్ర = సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని కన్నులుగాఁగలవాఁడా! ధవళ గాత్ర = తెల్లని దేహముగలవాఁడా! తాప, నిచ్చెన, అనఁగ, నిశ్రేణి = నిచ్చెనకు = పేళ్ళు. ప్లవమునకు = తెప్పకు, తెప్ప, తేప, అని పేళ్ళు. ఓడ, కలము, అనునవి నావకుఁ బేళ్ళు.



తే. కార్ముకం బొప్పు విల్లు సిం । గాణి యనఁగఁ
దూణ మొప్పు బత్తళిక నా । దొన యనంగ
దరకసం బనఁ బొది యనఁ । దనరు శరము
కోల ములి కమ్ము తూఁపు నా । (శూలపాణి!) **148**

విల్లు, సింగాణి (శింజిని–ప్ర) అనఁగా, కార్ముకము = ధనువు, ఒప్పును. బత్తళిక, దొన, పొది, అన తూణము = అంబుల పొది, ఒప్పును. కోల, ములికి, అమ్ము, తూపు, అనఁగా శరము = బాణము, తనరును.

తే. తనరుఁ బేళ్లు తనుత్రాణ । మునకుఁ గత్త
ళంబు జోడు జిరా దుప్ప । టంబు బొంద
ళం బనఁగ నాఖ్యలగు శతాం । గంబునకును
దేరు నా నరదము నాఁగ । (మేరుచాప!) **149**

కత్తళము, జోడు, జిరా, దుప్పటము, బొందళము అనఁగా, తనుత్రాణము = కవచము, ఒప్పును. తేరు, అరదము (రథము–ప్రకృ) అనఁగా, శతాంగమునకు = పెక్కు భాగములుగల రథమునకు పేళ్ళు.

క. కన్నా కన్నను దలక
ట్టన్నను మఱి మేలుబంతి । యన్నను ధరలో
నిన్నియు శ్రేష్ఠము పేళ్లై
యెన్నంబడు రాజసభల । (నిభదైత్యహరా!) **150**

ఇభదైత్యహరా! = గజాసురునిఁ జంపినవాఁడా! రాజసభలకు = రాజుల సభలయందు, కన్నాకు, తలకట్టు, మేలుబంతి, అను, ఈ పదములు, శ్రేష్ఠము పేళ్లై = ఉత్తమత్వమునకు నామములై ఒప్పును.

క. సొమ్మనఁ దొడ వనఁగా రవ
ణమ్మన నగుఁ బేళ్ళు భూష । ణమ్ములకును హా
రమ్ములకు నగును నభిధా
నమ్ములు పేరులన సరులు । నా (శితికంఠా!) **151**

సొమ్ము, తొడవు, రవణము (ప్రోఁగునది) అనునివి, భూషణముల కణ = ఆభరణములకు నామములు. పేరులు, సరులు అనునవి, హారమునకు నభిధానంబులు = కంఠహారముల పేళ్ళు

తే. సరము లెత్తులు దండలు । సరులనంగ
నామధేయంబు లగుఁ బుష్ప । దామమునకు
వాసనకు నాఖ్యలై యొప్పు । వలపు కంపు
తావి కమ్మన యనఁగఁ (గా । త్యాయనీశ!) **152**

కాత్యాయనీ + ఈశ = పార్వతికిఁ బతియైనవాఁడా! సరులు, ఎత్తులు, దండలు, అనఁగా, పుష్పదామములకణ = పూలదండలకు, నామములు. వలపు, కంపు, తావి, కమ్మన అనఁగా వాసనకు = గంధమునకు, నామములు.

క. ఒడమె యన సొమ్మనంగా
విడిముడి యన రొక్కమనఁగ । వి త్తంబునకుం
బుడమిని నామములగు నివి
(యుడురాజకళావతంస! । యురగాభరణా!) **153**

ఉడురాజ కళావతంస! = చంద్రునియొక్క కళ, శిరసుపూవుగాఁ గలవాఁడా! ఉరగాభరణా! = పాములు సొమ్ములుగాఁగలవాఁడా! ఒడమె, సొమ్ము, విడిముడి, రొక్కము (రుక్మము-ప్ర) అనునవి, విత్తమునకణ = ధనమునకు, పేళ్ళు.



తే. మచ్చు లన మిద్దె లనఁగను । మాడుగు లన
దారునిర్మిత గేహముల్ । దనరుచుండుఁ
బరఁగు సౌధంబు మేడ । యు ప్పరిగ యనఁగ
(నాగకేయూర! మౌని మా । నస విహార!) **154**

నాగకేయూర! = పాములు భుజభూషణములుగాఁ గలవాఁడా! మౌని మానస విహార! = మునుల మనసులందు విహరించువాఁడా! మచ్చులు, మిద్దె, మాడుగులు, అనఁగా దారు నిర్మిత గేహముల్-కట్టె నుపయోగించి కట్టినయిండ్లు (పూర్వము శిలాగృహములు, దారు నిర్మితగృహములని రెండు విధములనుండినవి కాఁబోలును. ఒప్పును. సౌధముల్ = తెల్లనైన రాచనగరులు, మేడలు, ఉప్పరిగెలు, అనఁగా ఒప్పును.

తే. పెట్టె యన మందసం । బనఁ బెట్టె యనఁగఁ
బెట్టియ యనంగఁ బేటికా । భిఖ్య లమరు
ప్రోఁ డనంగను మోటు నా । మొద్దనంగ
వెలయు స్థాణుసమాఖ్యలు । (విశ్వనాథ!) **155**

పెట్టె, (పేటిక-ప్ర) మందసము, పెట్టె, పెట్టియ, అనంగను, పేటికాభిఖ్యలు = పెట్టెకు నామములు. ప్రోడు, మొద్దు, మోటు, స్థాణుసమాఖ్యలు-కదలనిదాని పేళ్లు.

ఆ. వి స్తృతాఖ్య లొప్పు । విప్పు తనర్పు నా
వెడఁద విరివి పఱపు । వెడలుపనఁగ
దీర్ఘమునకు నామ । ధేయంబులై యొప్పు
నిడుద చాఁపు నిడివి । నిడు పనంగ **156**

విప్పు, తనర్పు (తనరుచు-ధాతువు) వెడద, విరివి, పఱపు, వెడలుపు, నా = అనఁగా, వి స్తృతాఖ్యలు = విరళతకుఁ బేళ్ళు.

నిడుద, చాపు, నిడివి, నిడుపు, అనఁగ, దీర్ఘమునకు నామధేయంబులు = పొడవునకుఁ బేళ్ళు.

ఆ. ఈడు దినుసు సాటి ఽ యెన దొర సరి జోడు
సవతు మాద్రి యుద్ది ఽ జత తరంబు
పురుడు నాఁగ సదృశ ఽ మున కివి యాఖ్యలౌ
(వివిధగుణసనాథ! ఽ విశ్వనాథ!) 157

వివిధగుణసనాథ! = నానావిధ వర్తనములకు స్థానమైనవాఁడా! విశ్వనాథా! ఈడు, దినుసు, సాటి, ఎన, దొర, సరి, జోడు, సవతు, మాద్రి (మాదిరి) ఉద్ది, జత, తరము, పురుడు, నాఁగ = అనఁగా, సదృశమునకు = సాటితనమునకు ఇవి, ఆఖ్యలు = పేళ్ళు.

తే. పసిఁడి బంగరు బంగారు ఽ పైఁడి పొన్ను
జాళువా పుత్తడి యనంగ ఽ స్వర్ణ మమరుఁ
దప్తకాంచన మమరుఁ గుం ఽ దన మనం గ
డాని యపరంజి నా (గజ ఽ దానవారి!) 158

పసిడి, బంగరు, బంగారు, పైఁడి, పొన్ను, జాళువా, పుత్తడి, అనంగ, స్వర్ణము = హేమము, అమరును. కుందనము, కడాని, అపరంజి, నాఁ = అనిన, తప్తకాంచనము = కఱిగించిన బంగారు

ఆ. చిదురు తునుక తునియ ఽ చిదురుప వ్రక్క పా
లనఁగ ఖండమునకు ఽ నాఖ్యలమరుఁ
బ్రోగు గుప్ప వామి ఽ ప్రోవు తిట్టయనంగ
రాశి కాఖ్య లగు (ధ ఽ రాశతాంగ!) 159

ధరాశతాంగ! = భూమియే రథముగాఁ గలవాఁడా! చిదురు, తునుక, తునియ, చిదురుప, వ్రక్క, పాలు, అనఁగా, ఖండమునకు =



ఒక భాగమునకు, ఆఖ్యలు = పేళ్ళు. ప్రోగు,కుప్ప,వామి, ప్రోవు, తిట్ట_రాశికి = గుమికి, ఆఖ్యలు = పేళ్ళు.

క. ఈ స్థావరవర్గం గడు
నాస్థ వినఁ జదువ వ్రాయ ఽ నవనిస్థలిలో
నాస్థాణునికృప నఖిలశు
భస్థితులును జనుల కొదవు ఽ భాసురలీలన్ 160

ఈ స్థావరవర్గమును, మిక్కిలి యాసక్తితో చదివినను, వినినను వ్రాసినను, ఆ శంకరుని దయవలన సకలమైన శుభములు గలుగును.

---

## తిర్యగ్వర్గు - జంతుకోటి నామములు

సీ. వెడఁదమోముమెకంబు ఽ జడలమెకం బేనుఁ
గులగొంగ మెకముల ఽ కొలము సామి
తెల్లడాలు మెకంబు ఽ తెఱనోటిమెకము సిం
గంబు నా బొబ్బ మె ఽ కం బనంగఁ
బరఁగును మృగరాజు ఽ పసిడిండి పులి మెకం
బులతిండిపోతు చా ఽ లలమెకంబు
మువ్వన్నె మెక మన ఽ నివ్వసుంధరయందు
వ్యాఘ్రంబునకు సమా ఽ ఖ్యలు చెలంగుఁ

ఆ. బుట్టకూడు దిండి ఽ పో తన వెనుక మూ
పుల మెకంబు నాఁగ ఽ నెలు వనంగ

నెలుఁగు నాఁగ మోర తెలుపుమెకంబు
భల్లుకంబు దనరు (ఫాలనేత్ర!) 161

వెడదమో[1]ము మె[2]కంబు = వెడల్పైన ముఖముగల మృగము జడ[3]మెకము = జడలుగల మృగము, ఏనుఁగులగొంగ = ఏనుఁగులకు విరోధియైన జంతువు, మెకములఱా[4]లమునా[5]మి = మృగసమూహమునకు రాజు (మృగరాజు), తెల్లడాలుమెకము = తెల్లని కాంతిగల మృగము, తెఱనోటి మెకము = తెరచియుండు వదనముగల జంతువు, సిం[6]గంబు = సింహము, బొబ్బమెకము = గర్జించుజంతువు, అనంగ, మృగరాజు = వార్యక్షము, పరగును = ఒప్పును. పసిదిండి = మాంసమును దినునది, పులి, మెకంబుల తిండిపోతు = జింకలను దినమరిగినది, చాఱలమెకము = దేహముపైఁ జారలుగలది, మువ్వన్నె మెకము (మూడు + వ[7]న్నె) = తెలుపు, నలుపు, పసుపు వర్ణముగలది; అనునివి, వ్యాఘ్రంబునకు సమాఖ్యలు = పెద్దపులికి పేళ్లు. పుట్టకూడు తిండిపోతు = పుట్టకూడు తినునది. వెనుక చూపుల మెకము = వెనుక దృష్టిగలది, ఎలువు ఎలుగు, మోర తెలుపు మెకము = తెల్లగానుండు మృగము, అనునివి భల్లూకమునకుఁ బేళ్ళు.

క. పలుగొమ్ములమెక మనఁగా
నిల నెక్కుడుమెక మనంగ నేనుఁ గనంగాఁ
బలువంజమెకము నాఁ జే
గలమెక మన గారనంగఁ గరి యొప్పు(శివా!) 162

పలుగొమ్ముల మెకముఁ = పంద్లే (కోరలే) కొమ్ములుగాగల జంతువు; ఎక్కుడుమెకము = ఎక్కుట కుపయోగించు మృగము, ఏనుఁగు బలువంజమెకము (బలువు + అంజ + మెకము) బలమైన పాదములుగఁ

ప్రకృతి రూపములు:—1. ముఖము, 2. మృగము, 3. జట 4. కులము, 5. స్వామి, 6. సింహము, 7. వర్ణము.



జంతువు, చేగలమెకము(చేయి + కల = చేగల)హస్తము (తొండముగాగల మృగము) గారు, అనునివి గజమునకు నామములు.

తే. వాజికి సమాఖ్యలగుఁ దేజి వారువంబు
మావు గుఱ్ఱంబు తట్టువ వావురంబు
కత్తలాని బాబా జక్కి తత్తడి యన
(విగత భవపాశ! కాశీ ని వేశ! యీశ!) 163

తేజి, వారువము, మావు, గుఱ్ఱము, తట్టువ, వావురము, (వారువము) కత్తలాని, బాబా, జక్కి, తత్తడి, అనునివి, వాజికి = గుఱ్ఱమునకు, నామములు.

క. తగ రేడిక పొట్టే లన
నగు మేషసమాఖ్య లెనిమి దడుగుల మెక మే
నుఁగు గొంగనూఁ డనంగా
జగతిఁ శరభాఖ్య లొప్పుఁ (జంద్రార్ధధరా!) 164

తగరు, ఏడిక, పొట్టేలు, అనునవి మేషసమాఖ్యలు = గొఱ్ఱెకుఁ బేళ్లు. ఎనిమిదడుగుల మెకము = ఎనిమిది పాదములుగల మృగము, ఏనుఁగుగొంగనూడు = సింహమునకు శత్రువు. అనఁగా, శరభాఖ్యలు = శరభము పేళ్ళు, ఒప్పును. ఇది శివుఁడు శరభావతారమెత్తినసు సందర్భమున సృష్టింపఁబడినది గాని నిజముగా నిట్టి మృగముండినదనుట విశ్వసింపరానిమాట.

క. సంగతి నుష్ట్రాఖ్యలు నొ
ప్పెం గడు నొంటె లన లొట్టి పిట్టలనఁ సా
రంగాఖ్య లలరు నిఱ్ఱు ల
నంగా జింక లన లేళ్లు నా (సర్వజ్ఞా!) 165

ఒంటె, లొట్టిపిట్ట, అనునవి, ఉష్ట్రమునకుఁ బేళ్ళు.
ఇఱ్ఱి, జింక, లేడి అనునవి సారంగాఖ్యలు = జింకకుఁ బేళ్ళు.

క. నులిగొమ్ముల మెక మిఱ్ఱన
నిల మృగమున కొప్పుఁ బేళ్లు మృగి — లేడి యనన్
వెలయును రెంటికిఁ దగు నా
ఖ్యలు జింక యనంగ (నీశ! — యంబరకేశా!) **166**

పైనామములు స్త్రీ పుంస్త్వముల కన్వయించుట నిందుఁ బ్రత్యే కింపఁ బడినవి. నులిగొమ్ముల మెకము = మెలికలు దిరిగిన కొమ్ములుగల మృగము, ఇఱ్ఱి, అనఁగా, దుప్పికిఁ బేళ్ళు. లేడి, అనునది యాఁడు జింకకుఁ బేరు. జింకయన రెంటికి నన్వయించును.

తే. పసులు తొడుకులు పసరముల్ — పసి యనంగఁ
బశువులకును సమాఖ్యలై — పరఁగు నాల
పోఁతు బసవఁడు గిబ్బ యాఁ — బోఁ తనంగ
వృషభమున కాఖ్యలై యొప్పు — వృషభవాహ!) **167**

పసులు, తొడుకులు, పసరములు, పసి అనునవి పశువులకు బేళ్ళు. ఆలపోఁతు, బసవఁడు, గిబ్బ, ఆఁబోఁతు, అనునివి వృషభము నకు = ఎద్దునకు, నామములు. (ఇది సాధారణముగ ఆఁబోతున కన్వయించును.

సీ. తొఱ్ఱుపట్టు లనంగ — దొడ్లనఁగా నివి
గోష్ఠ దేశమునకుఁ — గొఱలు (నీశ!)
కదుపులు మొదవులు — పదుపులు మందలు
నా ధేనుగణ మొప్పు — (నగనివేశ!)



యలరు నాఖ్యలు లేఁగఁ — లనఁ దూడ లనఁ గ్రేపు
లన వత్సములకును — (ధనదమిత్ర!)
యా వనఁగా గిడ్డి — యనఁ దొడు కన మొద
వన ధేనునామముల్ — దనరు (నభవ!)

తే. యుక్షమునకు సమాఖ్యలై — యొప్పుచుండు
గిత్త యెద్దనఁ గోడె నాఁ — (కృత్తివాస!)
యా లనఁగ ధేనువుల కాఖ్య — యలరుచుండు
(శైలజానాథ! ప్రమథ సం — చయ సనాథ!) **168**

తొఱ్ఱుపట్టులు, దొడ్లు, ఇవి కొట్టమునకు బేళ్ళు.
కదుపులు, మొదవులు; పదుపులు, మందలు, అనునివి ఆలమందలకుఁ బేళ్లు. లేగ, దూడ, క్రేపు అనునివి దూడకుఁ బేళ్ళు.
ఆవు, గిడ్డి, తొడుకు, మొదవు ఇవి యావునకుఁ బేళ్ళు. గిత్త, ఎద్దు, కోడె, అనునివి ఎద్దునకుఁ బేళ్ళు. ఆలు* అనునది గో సమూహమునకు నామము.

తే. అలరుఁ గుందేలు చెవులపోఁ — తనఁగ శశక
మొప్పుఁ బొడల మెకఁబు నా — దుప్పియనఁగఁ
గాఱుకొమ్ముల మెక మనం — గను ధరిత్రి
రామనామమృగంబు (ధ — రాశతాంగ!) **169**

కుందేలు, చెవులపోఁతు, అనునివి, శశకమునకుఁ బేళ్ళు.
పొడల మెకము = చుక్కలుగలది, దుప్పి, కాఱుకొమ్ములమృగము = దట్ట

*ఆవులు, ఆవు ప్రభృతులకు బహువచనము పరంబగునపుడు తుది వర్ణమునకు లోపంబు వైకల్పికముగానగును. జాము, జాలు.

ముగా బెజిగిన కొమ్ములుగలది, అనునివి, రామనామమృగంబు = రాముని యెలయించిన జింకవంటిదానికి (ఇట్టికి) నామములు.

తే. దుంత యెనుబోతు జమునెక్కి రింత దున్న
యనఁగ మహిషంబునకు సమా హ్వాయములమరు
బరఁగు నెను పెంట్లు గేదెలు బఱ్ఱె లెనుము
లనఁగ మహిషీసమాఖ్యలు (ధనదమిత్ర!) 170

దుంత, యెనుబోతు, జమునెక్కి రింత = యముఁడెక్కునది, దున్న అనఁగ, మహిషంబునకు = దున్నపోతునకు,నామములు.
ఎనుపెంటి = (ఆడు ఎనుము) గేదె, బఱ్ఱె, ఎనుము అనునివి, మహిషీసమాఖ్యలు = బఱ్ఱెకు పేళ్ళు.

తే. పక్కి పులుఁగు పిట్ట యనంగఁ పక్షియొప్పు
గఱులు ఱెక్కలు చట్టుప లెఱక నలఁగ
పక్షముల కివి పేళ్ళగుఁ బర్ణములకు
నాఖ్య లగు లావు లన నీఁక లనఁగ (నీశ!) 171

పక్కి (పక్షి—ప్ర) పులుఁగు, పుట్ట, అనునివి పక్షికిఁబేళ్ళు.
గఱులు, ఱెక్కలు, చట్టుపలు, ఎఱకలు అనునివి పక్షముల నామములు. లావులు, ఈఁకలు అనునివి ఈఁకలకు నామములు.

సీ. తొలకరి కలుగుపు ల్గులు నల్వతేజీలు
పాలునీరును నేరు పఱచుపులుఁగు
లంచలు తెలిపిట్ట లన నొప్పు హంసలు
క్రౌంచముల్ దనరారుఁ గొంచ లనఁగ



గొక్కెరా లనఁగను గొక్కు లనంగను
గొక్కెరలనఁగను గొంగ లనఁగఁ
బరఁగు నభిఖ్యలు బకవిహంగములకు
నట్టువ పులుఁగు నా జుట్టుపులుఁగు

తే. నాఁగ నెమ్మన నెమిలి నా నమ్మియనఁగఁ
గేకికిసమాఖ్య లగుఁ జంచ రీకమునకు
నాఖ్యలు జమిలిముకాలి యనఁగ దేటిఁ
యనఁగఁ దుమ్మెద నా (నీశ! యభ్రకేశ!) 172

తొలకరికలుగుపుల్గులు = వర్షాకాలమునందు పఱుగిడు పిట్టలు (వర్షాకాలమున నివి మానససరోవరమునకుఁ పోవును) నల్వతేజీలు = బ్రహ్మకు వాహనములు, పాలు నీరు నేరుపఱచు పులుఁగులు_క్షీర నీరముల వేరుచేయగల పక్షులు, అంచలు (హంసలు_ప్ర) తెలిపిట్టలు = తెల్లని పక్షులు, అనునివి హంసకుఁ బేళ్ళు. కొంచలు అను పేరు క్రౌంచ (బెగ్గురు) పక్షికిఁ జెల్లును. కొక్కురాలు, కొక్కులు, కొక్కెరలు, కొంగలు అనునవి, బకమునకుఁ బేళ్ళు. నట్టువపులుఁగు = నాట్యమాడు పక్షి, జుట్టుపులుఁగు = జుట్టుండు పక్షి. నెమ్మి, నెమిలి, నమ్మి, అనునివి, కేకికి = నెమలికి, పేర్లు. జమిలి ముకాలి = మూడు జంటల కాళ్ళుగలది, తేటి, తుమ్మెద, అనునివి భ్రమరమునకుఁ పేర్లు.

తే. పరఁగు నొడ్డీలు కూకీలు పల్లటీలు
పావురాలును బకదార్లు పావురములు
నాఁగఁ గలరవపక్షి బృం దముల పేళ్లు
(పంకజాతాక్షసన్మిత్ర! ఫాలనేత్ర!) 173

పంకజాతాక్ష సన్నిత! = పుండరీకాక్షుఁడగు విష్ణువునకు మిత్రమైన వాఁడా! ఫాలనేత్ర = నొసటఁ గన్నులుగలవాఁడా! ఒడ్డీలు, కూకీలు, పల్లటీలు, పావురాలు, బకదార్లు, పావురములు, అనునివి కలరవపక్షి బృందములకు = మనోహరమైన శబ్దముచేయు పావురముల గుంపునకు నామములు **Doves.**

తే. పుడమిలోపలఁ జదువుల । పులుఁగసంగఁ
జిగురువిల్కాని తేజి నాఁ । దొగరు ముక్కు
పులుఁ గనఁగ బచ్చుతెక్కల । పులుఁగనంగఁ
జిలుక యన నొప్పుఁ గీరంబు । (శ్రీమహేశ!) **174**

చదువుల పులుఁగు = మాటలాడు పక్షి, చిగురువిల్కాని తేజి = మన్మథునకు వాహనము, తొగరుముక్కు పులుఁగు = ఎఱ్ఱని ముక్కుగల పక్షి, పచ్చతెక్కల పులుఁగు = ఆకుపచ్చని తెక్కలుగలది. చిలుక, అనునివి, కీరమునకు, నామములు.

తే. బట్టికాఁ డన గోరవంక । పిట్టయనఁగఁ
బరఁగు శారిక యేట్రింత । పసులపోలి
గాఁడు కూఁకటిమూఁగ నాఁ । గను జెలంగు
నిల భరద్వాజవిహగంబు । (కృత్తివాస!) **175**

బట్టికాఁడు, గోరవంకపిట్ట, అనునివి, శారికకు = గోరువంక పక్షికి, నామములు. ఏట్రింత, పసులపోలిగాఁడు, కూఁకటిమూఁగ, అనునివి, భరద్వాజపక్షికి నామములు.

తే. జాలె డేగనఁ గురుజు నా । సాళ్వ మనఁగఁ
గణుజు నాఁగను జలకట్టె । యనఁగ వేస



డం బనఁగ గిడ్డు నా నోర । ణం బనంగ
శ్యేనభేదంబు లగు (మహా । సేనజనక) **176**

మహాసేన జనక = కుమారస్వామికిఁ దండ్రియైనవాఁడా! జాలె, డేగ, గురుజు, సాళ్వము, కణుజు, జలకట్టె, వేసడము, గిడ్డు, ఓరణము, అనునివి శ్యేనభేదములు = గ్రద్దలలోఁగల తెగలకుఁ బేళ్ళు.

తే. కోఁట డనఁగను గూబనా । ఘూకమమరుఁ
జిలుతగూబ యనంగఁ బ । సిండికంటి
యనఁగ సకినాలపులుఁ గన । నలరుచుండుఁ
బృథివిఁ గనకాక్షి యనుపక్షి । (శ్రీమహేశ!) **177**

కోఁటడు, గూబ అనఁగా, ఘూకమమరుఁ = గుడ్లగూబ, ఒప్పును. **Owl.** చిలుతగూబ, పసిండికంటి = బంగారువంటి కన్నుగలది, సకినాలపులుఁగు; (శకునము ప్ర — సకినము — వి.) = శకునముల పక్షి, అనిన, కనకాక్షి యనుపక్షి పేళ్ళు.

తే. పాము సప్పంబు నిడుపఁడు । పడగదారి
గాలిమేఁతరి విసదారి । కానరాని
కాళ్ళయది చిల్వ వీనుల । కంటి పుట్ట
పెట్టెపట్టనఁ జను నహి । పేళు (భర్గ!) **178**

పాము, సప్పము (సర్పము — ప్ర) నిడుపడు = చిఱకాలము జీవించునది, పడగదారి = పడగగలది, (ధారి—ప్ర) గాలిమేఁతరి = గాలినిదినునది, విసదారి = (కోరల) విషము ధరించునది, కానరాని కాళ్ళయది = కాళ్ళగుపడనిది; చిల్వ, వీనులకంటి = చెవులు కన్నులుగాఁగలది. పుట్టపెట్టెపట్టు = పుట్టలు, పెట్టెలు నివాసముగాఁగలది. అనఁగా అహి = పాము ఒప్పును.

క. ఇల నెంచ రుధిరమున కా
ఖ్యలు నల్ల యనంగ నెత్తు ర నఁగ ధరిత్రిం
బొల యీరు వెఱచి నంజుడు
పొలసన నివి పరఁగు మాంస ము నకు (మహేశా!)

నల్ల, నెత్తురు, అనగా రుధిరమునకు = రక్తమునకు ఆఖ్యలు. రక్తము నాళములయందుఁ దిరుగునదిగాన తిర్యగ్వర్గునందుఁ జేర్పఁబడిన దేమోకాని మాంసమునకిందు (ప్రవేశకారణము మృగ్యము). పొల, ఈరు, వెఱచి, నంజుడు పొలసు; అనునివి మాంసమునకుఁ బేళ్ళు,

క. భర్గుఁడు కాశీనిలయుఁడు
దుర్గాపతి యొసఁగు ముదము తో నీ తిర్య
గ్వర్గ లిఖించినఁ జదివిన
దౌర్గత్యము లణఁచి సంప దలు నిత్యంబున్ 180

తా. ఈ తిర్యగ్వర్గును జదివినవారికిని, వ్రాసినవారికిని కాశీ నివాసుఁడైన, పార్వతీదేవికిఁ బతియైన భర్గుఁడు దారిద్ర్యములనణచి (పాపములందు పడుట నుడిపి) నిరంతర సంపదల సంతసముతోనిచ్చును.

---

## నానార్థవర్గు
## వివిధార్థములుగల పదసముదాయము

పై వర్గములందుఁ బర్యాయపదముల వ్రాయుచు, నపుడర్థాంతరము దోఁచినపదములనన్నిఁటిఁ గూర్చి యీ వర్గమును కవి వ్రాయుచున్నాఁడు. అమరసింహుఁడు నిటులే యొనరించెను.

క. కలుపనఁ బేరగు దధికిం
గలు పన సస్యంబులోని గానము పే రా



వెలు గంద్రు కంపకోటను
వెలుగందురు ప్రథను జనులు (విశ్వాధిపతీ!) 181

కలుపు = పెరుగు, పైరులనుండు గడ్డి. వెలుగు = కంచె, వెలుతురు. (వెలుతురను నర్థమువచ్చుటకు వెలుఁగు అని వ్రాయవలెను. ఉచ్చారణ మున నర్థానుస్వారపుటునికి గమనింపఁబడదు గనుక కవి యిటు వ్రాసి యున్నాఁడు.)

క. మావు లనం దగు హయములు
మావు లనం బరఁగు నామ్ర మహిజంబు లిలం
దావు లన స్థలములొప్పును
దావు లనర్ వాసనలకుఁ దగుఁ బేరు (శివా!) 182

మావులు = గుఱ్ఱములు, మామిడిచెట్లు. (ఇక్కడ మావులను బహు వచన ప్రయోగమునకే నానార్థములు. దీనిఁబట్టి ఏకవచనము మావియనగా గుఱ్ఱమని చెప్పరాదు, మావు అనవలెను.), తావులు = వాసనలు, చోట్లు, పైదానివలె నిందును బహువచనమే గ్రాహ్యము, (ఏకవచనము, తావి = వాసన; తావు = స్థలము).

క. ఇమ్మహిలోపలఁ బేరగుఁ
గొమ్మ యనర్ వృక్షశాఖ కును భామినికిం
దమ్ము లనఁ బేరు లగుఁ బ
ద్మమ్ముల కనుజన్ములకును (దరుణేందుధరా!) 183

కొమ్మ = శాఖ, స్త్రీ, తమ్ములు = పద్మములు, కనిష్ఠ సోదరులు, (ఏకవచనము తమ్మి = పద్మము, తమ్ముఁడు = సోదరుఁడు).

క. ఇమ్ములఁ బేరగుఁ దాటం
కమ్ములకున్ లేఖలకును గమ్ములనన్ నా

మమ్ము దగుం గంఠాభర
ణమ్మునకును లతకుఁ దీఁగె నా (గౌరీశా!) 184

కమ్మలు = కర్ణభూషణములు, జాబులు; తీఁగ = మెడలోని సొమ్ము, లత.

క. చెల్లును బేళ్లై ధరలోఁ
దాళ్ళన సూత్రంబులకును దాళంబులకుం
గోళ్ళనఁ గుక్కుటములకును
బేళ్ళగు ఖట్వాంగములకుఁ బేళ్ళగు (నభవా!) 185

తాళ్ళు = పగ్గములు, తాటిచెట్లు. (ఏకవచనము, తాడు, తాడియని యొప్పఁగవలెను) కోళ్ళు = మంచపుఁగోళ్ళు, కుక్కుటములు. (ఏకవచన రూపములు కోడు, కోడి).

క. చామ యన సస్యమునకును
భామినికిని నాఖ్య యగుచుఁ బరఁగు ధరిత్రిన్
నామము లగుచును వెలయును
బాము లనఁగ జన్మములకు భంగమ్ములకున్ 186

చామ = ఒకవిధమైన పైరు, స్త్రీ, బాములు = పుట్టుకలు, తిరస్కారము, లేక కష్టములు.

తే. దంట యనఁగ నభిఖ్యయై తనరుచుండు
జగతిలోపలఁ బ్రౌఢకు యుగళమునకుఁ
బఱ పనంగ నభిఖ్య యా బానుపునకు
విస్తృతమునకు (శైలనివేశ! యీశ!) 187

దంట = ప్రౌఢయైన యాఁడుది, జంట; పఱపు = పడక, వ్యాప్తి.



క. తొలి యనఁగా నగు నామం
బులు పూర్వంబునకు సుషిర మునకును ధరలో
వెలియనఁగ బహిర్ధవళం
బులకును నామంబు (శేష భుజగవిభూషా!) 188

తొలి = ఇంతకు ముందు, బెజ్జము; వెలి = వెలుపల, తెల్లదనము.

క. నెమ్మి యనఁగ వంజుల వృ
క్షమ్మునకును బర్హికిని సుఖస్థితికిని నా
మమ్మగుఁదగు (నతిధీర య
హమ్మతి జనదూర! పన్నగాధిపహారా!) 189

నెమ్మి = వంజులవృక్షము, నెమలిపక్షి; సుఖము మైనుండుట.

క. పాలం బే రగుచుండును
బా లనఁగా క్షీరమునకు భాగంబునకుం
గా లనఁ బే రగు నాలవ
పాలికిఁ బాదంబునకును (బాలేందుధరా!) 190

పాలు = క్షీరము, భాగము; కాలు = పాదము, నాలవభాగము.

క. మేలన శుభంబు పేరగు
మే లన నుపరికిని గూరి మికినిం బేరౌ
మే లన మెచ్చునఁ బల్కిన
యాలాపంబునకు నాఖ్య యగు (జగదీశా!) 191

మేలు = శుభము, పైభాగము; ప్రేమ, హితమైనమాట.

క. ధారుణిఁ బేరు వహించును
బూరుగు నా నూఁదువాద్య ఽ మును శాల్మలియుం
బే రన నభిధానం బగు
హారమునకు నామమునకు ఽ (నంబరకేశా!) 192

బూరుగు = వాద్యవిశేషము, బూరుగమ్రాను; పేరు = నామము, మెడలోని దండ.

క. క ప్పన నీలిమ పే రగుఁ
గ ప్పనఁగా నింటిమీఁది ఽ కసవుకుఁ బేరాఁ
గొప్పనఁ దగుఁ జాప్రాగము
నొప్పగు ధమ్మిల్లమును ఽ గృహోపరియ(శివా!) 193

కప్పు = నలుపు, ఇంటిమీది కప్పు; కొప్పు = స్త్రీలకొప్పు, ఇంటి కొన, ఇంటి నడుకొన.

క. ఒక భూరుహామునకును ధమ
నికిఁ బేరగుఁ గ్రోవి యనఁగ ఽ నెఱి నట్టుల వే
ఱొక భూజమునకు నధరము
నకుఁ బే రగు మోవి యనిన ఽ (నగరాట్చాపా!) 194

క్రోవి = గోరింట, గొట్టము; మోవి = పెదవి, ఒకానొక చెట్టు.

క. చవు లనఁగా నభిధానము
లవు షడ్రుచులకును ముత్తి ఽ యపుజొత్తులకున్



భువిలోపల నామము లగు
గవు లన గుహాలకునుఁ బూతి ఽ గంధంబులకున్ 195

చవులు = నోటి రుచులు, ముత్తెపు దండలు; గవులు = గుహాలు చెడ్డవాసన (గుహాయర్థమగుచో గవియగును, వాసనయను నర్థమున నిది యేకవచనమే యగును.)

తే. ఆఖ్యయై యొప్పు ధరణిలో ఽ నపరదివస
మునకు ఛత్త్రంబునకు నెల్లి ఽ యనెడినుడువు
జక్కి-యను పేరు పరఁగును ఽ సైంధవంబు
నకు ఘురట్టంబునకును (గం ఽ దర్పదమన!) 196

ఎల్లి = రేపు, గొడుగు; జక్కి = గుర్రము, తిరుగలి.

తే. ఆడె నను మాట నటియించె ఽ ననుటకును వ
చించె ననుటకు మరియు నిం ఽ దించె ననుట
కాఖ్య యగుచును శోభిల్లు ఽ నాలు నాఁగ
గోవులకు భార్యకును బే ర ఽ గు (స్మహేశ!) 197

ఆడెను = నాట్యము చేసెను, పలికెను, నిందించెను; ఆలు = గోవులు (దీని కేకవచనము ఆవు.) భార్య (దీనికి బహువచనరూపము ఆండ్రు; ఈ రెండును సూత్రములచే సాధింపఁబడిన రూపములు).

సీ. రజతపునఃపదా ఽ ర్థములకు నభిధాన
మగు వెండి యన బంతి ఽ యనఁగఁ గందు
కమునకు శ్రేణికి ఽ నమరు నాహ్వాయముగా
దండ యనం బుష్ప ఽ దామమునకు

నంతికంబునకుఁ జేరగు దొర యన నాఖ్య
యగు సదృశమునకు నవనిపతికి
నస్త్రసంఖ్యకు నహమ్మనుటకు నాహ్వాయం
బగు నే ననఁగ సరి యనఁగ సదృశ

తే. మునకు సమసంఖ్యకును నామ ముగ నెసంగుఁ
గొంతనఁగ నాహ్వాయం బగుఁ గుక్కుటాస
నంబునకుఁ గంఠమునకును నల్లయనిన
రక్తనీలాఖ్యయై యొప్పు (రాజమకుట!) 198

వెండి = రజితము, మరల, బంతి = చెండు, వరుస (దీనికి పంక్తి యని ప్రకృతి) దండ = పుష్పహారము, సమీపము; దొర = సమానము, రాజు; ఏను = అయిదు, నేను, (నీ మీ నే మే ల తొలిహల్లునకు లోపమను సూత్రమున ఏను ఏర్పడినది) సరి = సమానము, సరి సంఖ్య (ఒప్పుదల చూపుటకను పదము) గొంతు = కుక్కుటాసనము, మెడ; నల్ల = నెత్తురు, నలుపు.

సీ. తీరంబునకు ధరి త్రీధరంబునకు న
మాఖ్యయై యొప్పు గట్టనఁగ (నీశ!)
కేతువునకుఁ గాంతికిని సమాహ్వాయ మగు
డా లనంగను (మేరు శైలచాప!)
కార్యధుర్యునకు లాంఛనమునకును నామ
మగు బిరు దనఁగఁ (బన్నగవిభూష!)
గూబ నా నాఖ్య యాఘూకంబునకుఁ గర్ణ
మూలంబునకు (నవి ముక్తనిలయ!)



తే. యంతికంబునకును సమూహంబునకును
నామమై యొప్పుఁ జేరువ నాఁగ (నభవ!)
సమభిధానమై యొప్పుఁ బిశాచమునకు
బవనమునకును గాలి యన్పలుకు (రుద్ర!) 199

గట్టు = తీరము, కొండ; డాలు = టెక్కెము, కాంతి; బిరుదు = కార్యము, గుఱుతు; గూబ = గుడ్లగూబ, చెవిలోపలి భాగము; చేరువ = దగ్గఱ, గుంపు; గాలి = దయ్యము, (పిశాచబాధ) వాయువు.

క. ఇలలోపల నామం బగు
పలుకులు నాశకలములకు భాషణములకున్
నెల యన నభిధానం బగు
జలజారికి మాసమునకు (శైలనిశాంతా!) 200

పలుకు = మాట, తుంట; నెల = చంద్రుఁడు, మాసము.

సీ. అంతర్హితుం డయ్యె ననుటకు నాగతుం
డయ్యె ననుటకును సమాఖ్య యగుచు
నలరును విచ్చేసెననుట (యంబరకేశ!)
నెఱి సమాహ్వాయ మగుఁ గఱచె ననఁగ
నభ్యాస మొనరించె ననుటకు దంతపీ
డ యొనర్చె ననుటకు (నయుగనయన!)
వెలయుఁ దప్తక్షీర ములకు నభిజ్ఞకు
నాఖ్యయై యానవాలనుట (యీశ!)

తే. పఱచె ననఁగ సమాఖ్యయా బాధచేసెఁ
బ్రచలితుం డయ్యెననుటకుఁ (బాండురాంగ!)

పరఁగ మోహించె ననుటకుఁ | బరిమళించె
ననుట కొప్పును వలచె నా | (నళిక నేత్ర?) 201

విచ్చేసెను = వచ్చెను, కనుబడకపోయెను; కఱచెను = నేర్చుకొనెను, కొఱికెను; ఆనవాలు = కాగినపాలు, గుఱుతు; పఱచెను = కష్టపెట్టెను, పయనమయ్యెను; వలచెను = కోరెను, వాసన కలిగించెను.

సీ. ఆనె నంట సమాఖ్య | యాను వహించెఁ బా
నము చేసె ననుటకు | (నగనివేశ!)
చషకంబునకును దం | ష్ట్రికు నాఖ్య యాఁగోర
యనఁగ (శశాంక క | ళావతంస!)
మొక్కలీఁడనఁగ గొ | మ్ములు లేని కరికి ము
ర్ఖరునకుఁ బేరగు | (గరళకంఠ!)
మరకతచ్ఛవికి నం | బరమున కగుఁ బేరు
పచ్చడం బనిన (నం | బా కళత్ర!)

తే. క్షితిని దురగీపతికి వృ | త్త శిలకు నామ
ధేయ మైయొప్పు గుండునాఁ | (త్రిపురహరణ!)
నామ మౌ నొక్కసస్యంబు | నకును లోప
మునకుఁ గొఱ్ఱయనంగ (నం | బుద నిభాంగ!) 202

ఆనెను = మోచెను, త్రాఁగెను; కోర = గిన్నె, పెద్దపల్లు; మొక్కలీడు = కొమ్ములులేని ఏనుఁగు, మూర్ఖుఁడు; పచ్చడము = పచ్చలకాంతి, పైవేసికొను వస్త్రము; గుండు = మగగుఱ్ఱము, గుండ్రనిబండ; కొఱ్ఱ = ఒక ధాన్యము, కొఱఁత.



సీ. తాల్చు నాఖ్యను వధూ | ధమ్మిల్ల భారంబుఁ
గోణంబు మూల నాఁ | (గుధరచాప!)
గొఱ యనునాఖ్యచేఁ | గొఱలు లోపంబు మ
నోజ్ఞవస్తువు (దక్ష | యజ్ఞమథన!)
నెఱి హేయపడియె న | స్వేషించె ననురెంటి
కాఖ్యయౌ రోసె నా | (నసితకంఠ!)
నరసె నాఁ బేరగు | నార్తి వారించె వి
మర్శించె ననుటకు | (మదనదమన!)

తే. చరణమునకు నధఃప్రదే | శంబునకు స
మాఖ్యయై యొప్పు నడుగునా | (నళిక నేత్ర!)
మహిని బేరగుచుండుఁ బ్ర | మాణికంబు
నకును భాషకు బాసనా | (నగనివేశ!) 203

మూల = స్త్రీలకొప్పు, దిక్కుల మధ్యదేశము; కొఱ = ఒక ధాన్యము (కొఱ్ఱ), ఇంపైన వస్తువు; రోసెను = వెగటును పొందెను, వెదకెను. (రెంటికిని ధాతువు రోయు) అరసెను = బాధను తొలగించెను, విచారించెను; అడుగు = పాదము, దాని క్రింది భాగము. (పంద్రెండంగుళముల నిడివి) బాస = ఒట్టు, భాష.

సీ. నాగవాస మన ఘుం | టాప్రతీకమునకు
వేశ్యల కగుఁ బేరు | (విశ్వనాథ!)
నామ మౌ నండంబు | నకు నండకునకును
గ్రుడ్డనంగనుఁ (రౌప్య | కుధరనిలయ!)

చర్మవాద్యమున కు షణ్ణమునకుఁ బేరగు
నుడు కనియెడునాఖ్య (యుడుపమకుట!)
యభిధాన మగు మేడి యన హలాంగమునకు
దుంబరమునకును (ధూతకలుష!)

తే. కల్లనఁగ శిల సురయు నాఁ (గరళకంఠ!)
పరఁగు నాఖ్యయు లాంగల పద్ధతికిని
శ్రేణికిని జాలనంగ (భా సితసితాంగ
వారధి నిషంగ! కాశీ ని వాస లింగ!) **204**

నాగవాసము = గంటలోని చీల, వేశ్యల గుంపు; గ్రుడ్డు = కన్నులు కానరానివాఁడు, అండము; ఉడుప = ఒకానొక వాయిద్యము, వేడిమి; మేఁడి = (మేఁడిలోక) నాఁగటికొయ్య, అత్తిచెట్టు ఇది యగునపుడర్థాను స్వారముండదు, మేడి) కల్లు = ఱాయి (ఇది కర్ణాటక పదము) మద్యము; చాలు = వరుస, నాఁగటిచాలు.

తే. జననికిని మాతృజననికి జనకజనని
కాఖ్య యగు నవ్వ యనఁగ (నా ర్యాసహాయ!)
భగినికిని జనకునకు నా హ్వాయము దనరు
నప్ప యనఁగను (జంద్ర శే ఖావతంస!) **205**

అవ్వ = తల్లి, (అంభా శబ్దభవము) తల్లి తల్లి, తండ్రి తల్లి (జేజి యని ప్రయోగము) అప్ప = అక్క, తండ్రి (కర్నాటక ప్రయోగము).

క. పోతనఁగఁ బరఁగు మహిషము
భూతలమునఁ బురుషమృగము బురుషఖగంబుం



దాతన ధాతృ పితామహ
మాతామహులకునునగు సహమాఖ్య(మహేశా!) **206**

పోతు = దున్నపోతు, పురుష మృగము, మగపక్షి (దీనికి మహత్యర్థకము-పెంటి) తాత = బ్రహ్మ, తల్లి తండ్రి, తండ్రి తండ్రి.

క. పుడమిని బేరు వహించును
వడిగలవాఁడనఁగ శౌర్య వంతుఁడు జవియున్
నడు మన నవలగ్నముఁ జె
న్నడరఁగ మధ్యస్థలంబు నగు (నగధన్వీ!) **207**

వడిగలవాఁడు = శూరుఁడు, వేగముగలవాఁడు; నడుము = దేహపు నడుము, దేనిదైన మధ్యభాగము (జవముగలవాఁడు = జవి).

క. ఎద యనఁగఁ బరఁగు భీతికి
హృదయమునకు వక్షమునకు నిల జోడనఁగా
నది దనరు నామ మగుచును
సదృశమునకు వర్మమునకుఁ (జంద్రార్ధధరా!) **208**

ఎద = భయము, హృదయము; జోడు = కవచము, సమానము.

క. నానార్థవర్గు విది స
న్మానముతో దీనిఁ జదివి నను వ్రాసిన నా
మానవుల కబ్బునెప్పుడు
నానార్థంబులును విశ్వ నాథుని కరుణన్ **209**

తా॥ అభిమానముతో నీ నానార్థవర్గము చదివినవారికిని, వ్రాసినవారికిని, విశ్వనాథుని దయావిశేషమున నానా (పురుషా) ర్థములు లభించును.

గద్యము. ఇది శ్రీమదేకామ్రమంత్రిపుత్త్రి కౌండిన్య గోత్రపవిత్ర సదారాధిత మహేశ్వర పైడిపాటి లక్ష్మణకవి ప్రణీతంబైన యాంధ్రనామ సంగ్రహం బను నిఘంటువునందు సర్వంబు నేకాశ్వాసము.

---